## అంకితము

## శ్రీ తిరుపతి కొండలకు



శ్రీః

# స్వాగతము

నేటి తెలుగునాటిలో రాజకీయ సాంఘిక సారస్వతాది సకల వ్యవస్థలయందును విప్లవకల్పమయిన మహాపరిణామము సాగుచున్నది. ముఖ్యముగా భాషాసాహితీరంగములలో గ్రాంథిక వ్యవహార భాషాసమస్య-ప్రాచీన నవీన సంప్రదాయ పథకముల సంఘర్షణ - గ్రంథకర్తల యార్థిక దుర్భరావస్థ తాండవించుచు సంక్షోభము గలుగజేయుచున్నవి. దీనికి తోడు, రసమయము, దయనీయము, కమనీయము నైన సాహితీరంగమున రాజకీయనర్తకి నాట్యము చేయుచున్నది. వాఙ్మయజగత్తు దారియు, తెన్నును లేక, అంధతమస్సుచే నావృతమైనది. స్వాతంత్ర్యోదయమైన వెనుక పరభావదాస్య భారమున క్రుంగియున్న సాహితీ సంస్కృతులను జాతీయతా స్ఫోరకముగ పునర్నిర్మాణము గావించుటకు సాహిత్యమే యాధారమైనది. ఆంధ్రమొక ప్రత్యేక రాష్ట్రముగా నేర్పడిన యీ తరుణమున సంస్కృతి పునర్నిర్మాణావశ్యకత మఱియు ప్రధానత వహించినది. ఇట్టి పరిస్థితులలో నాంధ్ర సాహిత్యము శక్తిమంతముగా, చైతన్యవంతముగా, సర్వోదయ సిద్ధాంత సూత్రానుసారముగ దిద్ది తీర్చుటకు, సాహితీ దివ్యామృతగుళికారూపములగు కావ్య[illegible]ళికలే వెలుగు బాటలు చూపగల యాధారములు - పునర్ని[illegible]ధమునకు పునాదులు.

నే డాంధ్రవాఙ్మయ ప్రపంచమున నిట్టి కావ్య దీప కళికాజ్యోతి. 'దీప సభ' యను పేరుతో మనకు దివ్యదర్శన మొసగుచున్నది. ఆనాడు మయుఁడు మహనీయమును, మనోహరమునగు మయసభా శిల్ప నిర్మాణము గావించిన ట్లీనాడు కృతికర్త భీమనకవి 'దీపసభా' కావ్య శిల్ప

నిర్మాణముగావించి, నవ్యాంధ్ర సరస్వతీదేవి నందు నాసీన గావించినాడు. మఱియు శిల్పము సంస్కృత ముద్రగలది - 'దీప సభా' శిల్పము అచ్చముగా ఆంధ్రతాముద్రగలది. ఈ కావ్యశిల్పము క్రొత్తపాతల మేలుకలయికల క్రొమ్మెఱుంగులు వాఙ్మయాకాశమున వర్తింపజేసినది. ఆ మేలికలయికయే యీకృతి కొక ప్రత్యేక - వ్యక్తిత్వము - విశిష్టత - ప్రసాదించినది. అనువాదపథకమున యంత్రవిముక్త నిర్జీవఖండములవలె నేకరూపముగ నుండు కావ్యకృతులవలెగాక, దీపసభ - దివ్యస్వాతంత్ర్యపథక కావ్య జ్యోతిర్మై దీపించుచున్నది.

ఆంధ్ర వాఙ్మయమున స్వతంత్రతాముద్ర గలది దేశిసాహిత్యము- స్వతంత్రకావ్యములయందు జాతీయజీవితము ప్రతిబింబింప జేయుటకు ననువగునట్లుగా ననువాదకృతులయం దనువుగాదు. భట్టారకాది కవుల సాంస్కృతికమగు మార్గ కవితాసంప్రదాయమును ప్రతిఘటించి, దేశి సాహిత్యము నుద్ధరించి, దానికి స్థిరశస్సు కల్పించి, వాఙ్మయ-ప్రపంచమున సత్కృతియన నూత్న సంగతియని మొదట సారస్వత విప్లవము కీర్తించిన మహాకవి పాల్కురికి సోమనాథుడు - అతడు వ్యాప్తి చెందించిన వీరశైవమే ఆకాలమునకు సాంఘిక విప్లవము. కథావస్తువు- కథానాయకుడు - ఛందస్సు - భావములు - భాష - అంతయు నూతనమే. అంతయు నాంధ్ర కవితా సృష్టియే - అందుచేతనే శివకవుల కృతులు స్వతంత్ర కృతులుగా నెన్నబడినవి.

తిక్కన మార్గదేశి సంప్రదాయములను సమ్మేళముచేసి, తిరిగి భాషలో మాత్రము దేశితనమున్న ట్లాదేశించి, నన్నయ మార్గకవితా పద్ధతినే ఘంటాపథముగా చేసియున్నాడు. ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ తిక్కనల ననుసరించినాడు - కవిత్రయ మహాభారత మార్గ కవితాపథకము కవుల కుపజీవ్యమైనది. భావములో, భావములలో, ఛందస్సులలో కవి భారత పథకమునకు, భాషానూత్రమునకు కట్టుపడినాడు. కవు లాత్మ స్వాతం

త్ర్యము గోల్పోయి గతానుగతికులైనారు - కవిత్రయము వారి వెనుక నాంధ్రకవితా సింహాసన మలంకరించిన శ్రీనాథ మహాకవి మార్గ దేశి మార్గములను సమన్వయముచేయుచు, కవితా స్వాతంత్ర్యజ్యోతియై ప్రకాశించినాడు.

ఇక ప్రబంధ యుగమునకు నావెనుకను పింగళి సూరన కళాపూర్ణోదయ మొకటియే స్వతంత్రకృతిగా వెలసినది. ఇది నిజముగా కావ్యకళాపూర్ణోదయమే. భాషలోను, భావ విన్యాసములోను ప్రాచీనానుసరణమున్నను, కథా కల్పనలో, కథా సంవిధానములో, కావ్యనిర్మాణ శిల్పములో సూరన యపూర్వ ప్రతిభ వెలయించినాడు. పాశ్చాత్య సాహితీ విమర్శనాపద్ధతులు వ్యాప్తమైనవెనుక నీ కళాపూర్ణోదయము ఖ్యాతి మఱియు నినుమడించినది. నాటికిని నేటికిని దీనిని బోలిన గ్రంథము కానరాలేదు. (ఈనడుమ నీ కావ్యముపై శ్రీ జి. వి. కృష్ణరావుగారు కొన్ని సంవత్సరములు పరిశ్రమచేసి, మహోత్తరమును, మహాప్రతిభావంతమును నగు నొక పెద్ద తత్త్వ వివేచన గ్రంథమును రచియించిరి.)

నవ్యసాహిత్యములో ఖండకావ్యకృతు లఖండముగా మెండుకొన్నవి. ప్రాచీనరచనా సంప్రదాయముల ననుసరించి, నవ్యవైఖరిని రచితములైన బృహత్కావ్యములు - రాణా ప్రతాపసింహ - శివభారతము - ఆత్మ కథ - ఆంధ్ర పురాణము మున్నగునవి కలవు. - వీనిలో కథాక్రమ రచనా నైపుణ్యమును, కమనీయశైలియు, కవితా రామణీయకతయు చదువరుల నందఱ నాకర్షించును. కాని యివి యించుమించుగా చారిత్రకము లగుటచే నిందు స్వతంత్రకల్పన కవకాశమే లేదు. మఱియు నీ కావ్యములయందు ప్రయుక్తమగు పలుకుబడి పండిత వ్యవహారమున కుపాదేయమైనది. ప్రజా వ్యవహారమునకు దూరమైనది. భాషాస్వాతంత్ర్యము లేకపోవుటవలన భావములన్నియు సమకాలిక వ్యవస్థలనుండి సంగృహీతములై కావ్యములలో ప్రతిఫలింపలేదు.

ఇట్టి విమర్శనా దృష్టితో పరిశీలించితిమేని దీపసభ నవ్యసాహిత్య మున వెలసిన కావ్యములలో నైకైకముగ ప్రత్యేక విశిష్టతగల స్వతంత్ర కావ్యమని చెప్పనొప్పును.

వైదిక వాఙ్మయమున, లౌకిక సారస్వతమున, వేదాంత శాస్త్రమున దీపప్రశంస కన్పట్టుచున్నది. "తమసో మా జ్యోతిర్గమయ" అను శ్రుతియు-

"సాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్ ।
భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహి మామ్ నరకాత్ ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోస్తు తే॥

అను దీపమంత్రమును నాంధ్రులకు సుపరిచితములు.

బౌద్ధవాఙ్మయమున దీపవంశమును,శాతవాహనులలో దీపకర్ణి రాజును గలరు.

ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్ (రఘువంశము)

ఇద మంధతమః కృత్స్నం జాయతే భువనత్రయమ్ ।
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే ॥
(దండికావ్యాదర్శము)

ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధిః (సౌందర్యలహరి)

అద్వైత వేదాంతమున వేదాంత పంచదశిలో విద్యారణ్యులవారు చిత్ర దీపము, తృప్తి దీపము, కూటస్థ దీపము, ధ్యాన దీపము, నాటక దీపము, అను నైదు ప్రకరణములు రచియించియున్నారు.

దీపజ్యోతులను తెలుగుసాహిత్యవీధిలో తొలుత వెలుగజేసినవాడు నన్నెచోడ కవిరాజ శిఖామణి - పరంజ్యోతి స్వరూపమును జ్ఞానజ్యోతిగా నిరూపించియున్నాడు. ఆ కవి రాజర్షి అమలజ్ఞాన సుదీపవర్తియై (1-15) గుఱుతెఱిగి వస్తుచయమున గాఁగడు నా దీపవర్తి (1-26) గాని రవికి దీపమున నర్చలిచ్చు కగిదివోలె (1-48) దీపిత విమలజ్ఞాన సుదీపిత సుఖ దళిత మోహ తిమిరాపహర వ్యాపారుఁడై (4-20) జ్ఞానదీపమ్ము హృత్స

దనములోఁ దాన దీవియగా నిల్పి (12-23) తన కావ్యమును లోకా
లోక శైలావళీ ప్రతిలోకాఖ్య మహీధరస్ఫురిత కుంభ స్తంభ దీపోజ్జ్వలా
యత తేజస్థితి' బర్వినట్లు రచియించియున్నాడు. దీప స్తంభము నేగాక
గృహదీపమును, దీపకళికలను నుట్టంకించియే యున్నాడు. గృహ దీపముల
వర్ణన చూడుఁడు.

క. తఱితఱి నిసుతో నడవక
పిఱుదెక్కిన రుచులు తమము బిట్టురుగుడు ని
వ్వాఱ నిండ్లలోన డాగిన
తెఱఁగున నుద్దీపదీప దీప్తులు వెలిగెన్. (8-95)

పైవానిలో "రవికి దీపమున నర్చలిచ్చు పగిదిపోలె" అను భావము శంకరా
చార్య రచిత సౌందర్యలహరి నుంచి గ్రహింపబడినది. (ప్రదీపజ్వాలాభిర్ది
వసకర నీరాజన విధిః.)

శివలింగ పూజాసమయమున దీపమొక ప్రధానాంగము కాబట్టి
పాల్కురికి సోమనాథుని గ్రంథములలో దీపప్రాముఖ్యము కన్పట్టుచునే
యుండును. ఒక భక్తుడు యీశ్వరుని దీపారాధనకై, తన సర్వస్వ
మును వెచ్చించి, తుదకు దీపము వెలిగించుటకు చమురు లేకపోగా
తన తల వెంట్రుక లన్నింటిని వత్తిగాచేసి దీపము వెలిగించినాడు. కావు
ననే యాతనికి దీపదకళియా రని పేరు వచ్చినది. మఱియు దీపవృక్షములను
దీపగంధములను సోమనాథుని గ్రంథములలో గాననగును.

తెలుఁగు నాటవెలసిన శాసన వాఙ్మయమున దీపదానమునకున్న
ప్రాముఖ్యము మఱి యేదానమునకు లేదని చెప్పవచ్చును. మన దేవాలయ
ములో నిత్య దీపారాధన యేర్పడుటకు నిదియే కారణము. పూజా సమయ
ములలో దీపముతో నర్చించుట నేటికిని గలదు. దేవాలయములయందు
నిత్యపూజ జరుగును గాన దీపమెప్పుడు నఖండముగా నచట వెలుగవలెను.
మన శాసనములలో అఖండదీప మనగా నిదియే - అది చలనములేకుండ
నొకే స్థానమున వెలుగును గాన దానికి స్థానదీపిక అని పేరుగల్గినది.
స్థానదీపిక తెలుగున తానదీవియ యైనది. దీపంబువెట్టె - దీపరత్నంబు

రచించె - దీపంబిడె - ఇత్యాదిగా తెనుగున పద్య శాసనములలో తఱచుగా కన్పట్టును. తిక్కన సోమయాజి యీ దీపదాన ప్రాశస్త్యముగూర్చి భారతము అనుశాసనికపర్వములో నిట్లు చెప్పియున్నాడు:

ఆ. వె. దైవతార్చలపుడు తామసభూత ర
క్షోముఖంబులైన కుత్సితంపు
జాతులెల్ల దీప సన్నిధి నడఁగు న
ట్లగుట దీపదాన మధిక ఫలము. (4-17)

క. జ్యోతిస్సాలోక్య కులో
ద్ద్యోతన మహితప్రకాశ యోగంబులు పు
త్రా తెచ్చు దీపదానము
దాత కొసగు నమర పూజిత సుఖిత్వంబున్. (4-23)

సుమనో ధూపదీప నైవేద్యంబు లుత్తమ పూజాసాధనంబులని ధర్మజ భీష్మ సంవాదమున తిక్కన తొలుతనే దీప ప్రాముఖ్యము దెలిపినాడు. పైవాని మూల శ్లోకము లివి:—

దేవా స్తేజస్వినో యస్మా త్ప్రభావంతః ప్రకాశకాః
తామసా రాక్షసాశ్చైవ తస్మా ద్దీపః ప్రదీయతే।
కులోద్యోతో విశుద్ధాత్మా ప్రకాశత్వం చ గచ్ఛతి
జ్యోతిషాం చైవ సాలోక్యం దీపదాతా భవేన్నరః।

దక్షిణాయన మంధతమోన్వితము, పాపకాలము కాబట్టి సాధారణముగా పుణ్యకాలమగు నుత్తరాయణమున నీ దీపదానము చేయుట నియతమైనది. తిక్కన్న భారతమున గిరిదీపము నిట్లు వర్ణించియున్నాడు.

క. ఒరులిచ్చిన దీపం బప
హరించి తత్పాతకమున నంధుండగు భూ
వర! రథ్యాసభ గుడిపై
గిరిదీపం బిడి విభూతికిం బాత్రమగున్. (అనుశాసనికపర్వము 4-21

గిరిదీప మనగా గుడి శిఖరములపై నిలిపెడి దీపము.

కాకతీయుల కాలమున కేవలము దీపపుసెమ్మెలకు బదులు దీపము స్త్రీ రూపమున ప్రవర్తిల్లునట్లుగా 'దీపలక్ష్మి' విగ్రహములను దేవాలయముల నెలకొల్పిరి.

శ్రీనాథుని కాలమునకు విద్యుద్దీపములే వెలసినవి. శృంగార నైషధమున "ఒక దీప మార్పిన నున్న దీపంబులు." అని తత్ ప్రస్తావన గలదు. క్రమ క్రమముగా దీపము కావ్యగృహములలో మన్మథరాగోద్దీపముగా వెలసినది. సాంఘికముగా దీపావళీ పండుగలు, కార్తిక దీపములు, గడ దీపములు, దీపకళికలు వెలుగుచున్నను నవి సాహిత్య వీధిని సన్నగిల్లినవి. మత సంప్రదాయిక గ్రంథములలో మినుకు మినుకు మనుచున్నవి. నవ్యాంధ్ర పద్య కృతులలో వేదులవారి 'దీపావళి' నాణ్యమైనది. అందొక ఖండము మాత్రమే దీపావళినిగూర్చి తెలుపునది.

నన్నయనుండి నిన్నటివఱకు "దీపసభ"వలె దీపమే ప్రధాన కథా వస్తువుగా గ్రహీతమై సంతరింపబడినది కావ్యమేదియు కానరాదు. కావున నవ్యాంధ్ర వాఙ్మయమున నిది యొక యపూర్వసృష్టి - అద్భుత సృష్టి. దీపముతో కథ చెప్పుట యనగా దీపమునకు రూపము నారోపించుట. ఇంతవఱకును వాఙ్మయమున దీప మొక జ్యోతి - ఇప్పుడది మానవ స్వరూపము దాల్చి దీపసభా సమావేశమునందు ప్రముఖపాత్ర వహించినది. పగలు జగజ్జ్యోతి యగు సూర్యుడు కర్మసాక్షి - రాత్రి దీప జ్యోతి కర్మసాక్షి. నిశీథమున సమస్త జగద్వ్యాపారములకు నిలుకడయగు నిత్యసాక్షి - దీపమే. కావుననే భీమనకవి కావ్యమును దీపముల మూలమున సమస్త విషయములను సుద్దీప్తము గావించినాడు.

"దీపసభా" కావ్యమున ప్రాచీన నవీన సాహితీ పథకములు రెండును గంగా యమునలవలె సమైక్యమును చెందినవి. కవిత్వము, చిత్రలేఖనము శిల్పము, గీతి సాహితీరీతులును నిందు చక్కగా ప్రదర్శితములై సమైక్య

మును ప్రస్ఫుటీకరించుచున్నవి. వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, ఈ సంస్కృత కవిత్రయ మిందుదాహృతులైనారు. వాల్మీకి మొదటి కావ్యము, వ్యాస భారతము, కాళిదాసుని 'మబ్బుకబురు' కవికి నమస్కారపాత్రము లైనవి. తెలుగు కావ్యములలో 'అల సరస్వతీ చతురాననుల మనోజ్ఞ మణితకథ తోడ సూరన్న ప్రత్యక్షమైనాఁడు. 'జీవితార్థములు శ్లేష కావ్యపుం బద్దెము లట్లు క్లిష్టములు బహు అసమమ్ము'లని కవి వ్యక్తపఱచినాఁడు.

ప్రాచీనకావ్యములే కాక ఆంధ్ర నవీన వాఙ్మయాలంకారములగు. జగన్నాథుని రథచక్రాలు, కిన్నెరసాని పాటలు మొదలగు రచనలు సూచింపఁబడినవి. గ్రామికులు పాడుకొను పలనాటి వీరకథలు, గొల్ల కథలు, బాలనాగమ్మ కథలు, బొబ్బిలి కథలు, చెన్నపరెడ్డి కథలు, తందానపాటలు 'రమ్యగేయ స్వరూప సారస్వతముగా' కవి ప్రదర్శించినాఁడు. పద్యరచన యందువలెనే గేయ రచనయందును భీమనకవి సిద్ధహస్తుఁడు. అతని గేయ కృతి 'రాగోదయం' ఈకావ్యమున రెండుమూడు మారులు మెఱసినది. రసోచితముగా ప్రియురాలి ప్రేమభావములను మోహనగీతిగా కవి సంతరించి నాఁడు. రాగోదయము ఇతఃపూర్వమే రచితమగుటచే నందులో నొక గేయమున 'దీపకథ'గా నీ కావ్యము సూచితమైనది.

లలిత కళలలో ప్రధానములగు కవిత్వము, శిల్పము, చిత్రలేఖనము, నాట్యము, సంగీతము మొదలగువానిని కవియుదాత్త భావములతో ప్రపంచించినాఁడు. విశ్వశ్రేయస్సునకు, సర్వోదయ పథకమునకు, కవితా కళయే సాధనము కాఁగలదని నిరూపించినాఁడు. 'ప్రమిదె దీప'మను శీర్షికలో కవితాకళనుగూర్చి, కవినిగూర్చి, గుడిదీపమున శిల్పకళను గురించి, మైనపు దీపమున చిత్రలేఖనము, చిత్రకారునిగూర్చి విపులముగా విమర్శనాదృష్టితో వివరణగలదు. బండిదీపము మొదలుకొని బ్రహ్మ స్వరూపమగు పరంజ్యోతి వఱకుగల సర్వ ప్రపంచమును ఈ కావ్య

పరిధిలో ప్రదర్శింపచేసిన ఈ కవి లోకానుభవము, ప్రతిభ, వ్యుత్పన్నత ప్రశంసాతీతములు. జగత్సత్యములను, గంభీరోదాత్తభావములను ఎట్లు ప్రవచించినాఁడో యీ క్రింది కొన్ని యుదాహరణములనుబట్టి గ్రహింప వగును.

" విమల జలపాతమట్లు వ్యాపించినాను
సత్తు చిత్తుల చెలువంపు సందులందు "

" క్షణములో నేదో పరమాణుశక్తి నాకు
కోటి యుగముల బరువుతో గుండె జొచ్చె "

" అవని సమతకు దెచ్చు విప్లవమునుండి
అభ్యుదయమందు నరుని శ్రేయస్సు వోలె "

" గీతగీతను రసపాకమేత మెత్తి
అందు తోనును ప్రవహించు "

" ఇహపరంబుల రెంటిని నెంతకైన
ధనము వెచ్చించి కొనగల ధనికుఁడు "

" నరుఁడు కట్టిన కుటిలవర్ణప్రభేద ఘోరకారాగృహమ్ము "

" వెలుఁగు మట్టముపై నెంత వేదమున్న
క్రింది లోతులలేదు కోరికల కంతు "

" రేపటికి పూర్తిసత్త్వమార్జించు కొనగ
ప్రణయ దేవత బొమ్మపై పవ్వళించు "

" బ్రహ్మచేసిన బొమ్మ చిత్రముగ తిరిగి
బ్రహ్మనే బొమ్మచేసిన పడకటింతు "

" అంతదనుక లోన నజ్ఞాతమైయున్న
కాంతులెల్ల నన్నుఁ గౌఁగలించె "

" ప్రకృతి సిద్ధములైన ధర్మములతోడ
సంఘ ధర్మాల కేనాఁడు సంధిలేదు "

" వలపు తలఁపుల జాబిల్లి వచ్చినపుడె
చీకటుల బాపుకొనుమమ్మ జీవితమున "

" రసజగత్తున కేకైక రాజ్ఞి పదవి
కడగి ధ్రువమయ్యె నపుడు శృంగారమునకు "

" చీకటిని బట్టుకొనగల్గు సిద్ధియున్న
వెలుఁగునకు శాశ్వతత్వమ్ము వెలయు దాన "

" రవిగాననిచో కవి గాంచునేకదా " అను నానుడిని యథార్థ మొనర్చిన యీ రచయిత రవీంద్రునివలె నవ్యసాహితీపథకమున యథార్థపు టంచులనుండి ఆదర్శజ్యోతిని వెలిగించినాఁడు. సర్వమానవ సౌభ్రాతృత్వమును, సార్వకాలికమగు శాంతి సందేశమును జాతీయ జీవనమునకు జీవజ్యోతులని, దీపసభా మూలమున నిర్దేశించి ఈ కృతికర్త భీమనకవి ఉన్నత సాహిత్యాదర్శనమును ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున ఆచంద్రార్కముగా నిల్పినాఁడు.

ఛందస్సు :—ఈ కావ్యమంతయు ప్రాచీన సంప్రదాయముల ననుసరించిన వృత్తములతో నున్నది. నవ్యసాహిత్యమున ప్రచారమున నున్న కంద, గీత, సీసములు, చంపకోత్పలమాలికలు నిందు ప్రయుక్తములైనవి. కాని మధ్యమధ్య కవి నూతన ఛందస్సులను ప్రవేశపెట్టినాడు.

| | | | |
|---|---|---|---|
| పరివృత్తు | పుట 15 | మంజరి - 12 పంక్తులు-3 పద్యములవలె నున్నవి. | |
| కొబ్బరితుంట | పుట 73 | — | 6 ముత్యాల సరములు |
| సెజ్జదివ్వె | పుట 121, | మోహానగీతి | 12 చరణములు |
| | 123, 124 | గేయములు | 4 చరణములు, 12 చరణములు |

ప్రాచీనులచే పరిగణితమై, అప్పకవినాటినుండి తప్పుగా నెన్నబడిన ఋ - ర యతి నీ కవి వాడి తన స్వాతంత్ర్యమును వ్యక్తపఱచినాడు.

"ఋషి బ్రదికియున్న భాష్యకారుని విధాన"

"సృష్టి వ్యక్తిత్వమందునఁ జూడఁగలము-"

"పూర్ణవైరుధ్యములతోడ పృథ్వి"

ఇది దేశి సంప్రదాయము (ఈ యతినిగూర్చిన సంపూర్ణ వివరములు నేను రచించిన 'భాషాపరిశోధన ప్రయోగ విశేషములు' అను గ్రంథమునఁ జూడనగును.)

ఇట్లే వందకాయతు, వొండకాయ యని యతి స్థానములో "వొండ కాయ చూఱవోయెనంచు" (పుట-46) అని ప్రయోగించినాఁడు. దీనికి ప్రయోగములు గలవు:—

వొకొక్క రాత్రివేళ కళ వొచ్చుచు- (పరతత్త్వరసాయనము)

"రాళిదొంగలు దోచినార న్న కబురు"

"అశామయ దృక్కులన్ బఱపుచాదటి దాపుల"

మొదలగు నఖండ యతు లిందు ధారాళముగ వాడియున్నాడు. ఇది పూర్వకవి సమ్మతమే.

# భాషా ప్రయోగములు

ఆనాడు పాల్కురికి సోమన జానుతెనుగు ననుసరించి వీరశైవ ప్రచారము గావించిన ట్లీనాడు జోయి భీమన ప్రజావ్యవహారములోనున్న అన్య దేశ పద జాలమును సమీచీనముగా ప్రయోగించి, చైతన్యదీపికలైన శబ్ద జాలమునకు కావ్యత్వసిద్ధిని సమకూర్చినాడు. కవులే భాషానుశాసనులు-కవి ప్రయుక్తమగు శిష్ట భాషయే మహోత్తమ కావ్య సాహితీ రచన కాధారము. తెనుగువారి వ్యవహారములలో తత్సమాన్య దేశ్య భాషాపదములు తెనుగువారి సొమ్మయినవి. అర్థభేదము గలిగినను, "ఆదర్శము" "విప్లవము" మొదలగు కేవల సంస్కృత పదములు వాడినగాని అర్థస్ఫూర్తి గలుగదు. వ్యావహారిక భాషారూపములు వాడినగాని రసస్ఫూర్తి గలుగదు. ఆంగ్లేయ భాషాపదములు రెండు శతాబ్దులనుండి కవులు వాడుచున్నారు- ఈనాడు తిరుపతి వేంకట కవులు - భోగరాజు నారాయణ మూర్తి మున్నగు కవు లింగ్లీషు భాషాపదములను ధారాళముగ ప్రయోగించి రసావృతము గావించియున్నారు. అన్యభాషాపదములు తెనుగు భాషలో నుపయోగించి స్వంతము చేసికొన్నగాని భాష పరిపుష్టముగాదు. ఇట్లే తెనుగు కవులు - స్థానికములగు మాండలీయకములను సార్వకాలికములుగా నొనరించి తెలుగు భాషను సర్వాంగసంపన్నముగా నొనర్చినారు.

భాషా ప్రయోగదృష్టితోడను, భాషాపరిణామదృష్టితోడను పరిశీలించిన దీపసభ యీనాటి కావ్యములన్నింటికన్న ప్రత్యేక విశిష్టతగలిగి భాషాపరిణామతత్త్వ పరిశీలనాపథకమునకు దివ్యజ్యోతియగుచున్నది.

దీపసభయందు దీ భాషా ప్రయోగము లెట్లు పొందుపడినవో చూపుచున్నాను.

లాంతరు - (పుట 4) "అద్దమూడిన లాంతరువంటె నిల్చి"

ఆద్యతనులలో ప్రసిద్ధ మీ పదమును వాడిరి :

లాంతరులోన దీపము చెలంగుచు నుండెను — ప్రభాకరశాస్త్రి.

వండిలాంతరు వెలిగించి విడలె రజని — రాయప్రోలు.

తనకునై బట్టు చేతిలాంతరున వెలుఁగు } కృష్ణదాసు.
దీప మొరులకు మార్గమ్ము జూపినట్లు

ప్లీడరు - (పుట 30) "ప్లీడరులోని గొప్పేమి టంచు" - ప్లీడరు న్యాయవాది యని పెద్దటీకంబున పేరుఁ గాంచుటన్ లీడరనంబడున్.— బిల్వేశ్వర శతకము - వెంకటరత్నం పంతులు.

కాఫీ (పొడుము) పుట 37 - బిందె బిందెడు కాఫీకి పిడుగుతునక - సాంఖ్యాయన శర్మ - కాఫీత్రాగి - శివశంకరులు.

పచ్చనోట్లు-పుట 79 — నోటితో నూద నెగిరెడి నోటువచ్చె (మించుపల్లె)

సోడాకొట్టు - పుట 96 — సోడావాటరులు - రామావధూటి తారావళి - అభినవ పండితరాయలు.

సిగరెట్టు-పుట 107 — నోట సిగరెట్టు జేబులో నోటుబుక్కు - ఆచంట సాంఖ్యాయనశర్మ

ప్రోగ్రాము—పుట 109—నిగ్రహులమైన మమ్ముల ప్రోగ్రాం కాగి తము లోన పారిఁజేర్చితివా కుగ్రామవాస. (పానుగంటి-కంఠాభరణము.)

రూలుదారిది రూలుది—పుట 112—ఉన్న హక్కులగూడ నూడఁ గొట్టెడు బ్లాకు బిల్సును రూల్సు గావించునపుడు - పురాణం సూర్యనారాయణ తీర్థులు కస్తూరి రంగయ్యంగారి షష్టిపూర్తి సందర్భమున చెప్పిన పద్యములు.

సూత్రార్థమున 'రూల్సు' అని, రేఖార్థమున 'రూళ్లు' అని వ్యవహారము -

ఉదా :—రూళ్ళ కాగితములు ౯ సీతాపతిగారి భారతీ శతకము ఇచట సూత్రార్థముననే వ్యవహారము.

సాలోపు జాటీపడుచు—పుట 100 - ఇది ఇంగ్లీషులో గణితశాస్త్ర సాంకేతికమైనపదము - త్రికోణమితి (Trignometry) లో వచ్చును ఈ పదము ప్రతి పల్లెటూరివానికి తెలియును. సామాన్య వ్యవహారములలో నున్నది. అయితే ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిన త్రికోణమితి గణిత తంత్రములో నీ పదమునకు 'ప్రావణ్యము' అని ప్రయోగించినారు. ఆంధ్ర నిఘంటువుల మాట అటుండనీయండి - కేవల శాస్త్రసాంకేతిక మగుటచే సంస్కృత నిఘంటువులలోకూడా కనబడదు. ప్రజావ్యవహార ములలో ఉన్న పదమును తొలగించినట్లయితే శాస్త్ర మెంతమాత్రమును అర్థముకాదు, అవగతము కాదు. వ్యావహారిక పదము వాడినప్పుడే మాతృభాషలో శాస్త్రము రచించిన ప్రయోజనము సిద్ధించును.

ఇట్లే యీక్రింది యాంగ్లపదములను వాడి మన భీమన కవి వానికి కావ్యత్వసిద్ధి గల్గించియున్నాడు.

ఆఫీసు - ఓవరులోడు - కారు - క్యూ - కేసు _ చెవర్లెట్టుకారు- జీపు కాఫీ - పార్టీలు - ట్యూరింగు సినీమా - ట్రే - టి. ఏ - డ్రైవరు- పంట్లాము ఫైల్లు - బాంబర్లు - బాక్సాఫీసు - పిటిషను - ఫిలుము - బ్రాడ్కాస్టరు - పోస్టర్లు - బస్సు - బనియను - బైసికిలు - మార్కులు - రికమెండు - సిగరెట్ - కాడీ - లాకు - లాఠీ - వర్కరు - వోటు - సబ్బు - సీటు - సైజు కాల్వ - స్విచ్చి - షాపు - హాటికెనులైటు.

వీనిలో చాలపదము లింతకుపూర్వము శబ్దరత్నాకర నిఘంటువులో నున్నవి. ప్రయోగములుకూడ కొన్నింటికి గలవు. గ్రంథవిస్తర భీతిచే విరమించితిని.

ఇంకను అన్యదేశీయములై ప్రజా వ్యవహారములోనున్న జటకా, రిక్షా, తమాష, జవాను, సరదా, గభాలున, మున్నగు పదముల నీ కవి యుపయోగించియున్నాడు. వీనిలో కొన్నింటికి ప్రయోగములను చూపు చున్నాను:

జెండాపై కపిరాజు అన్నట్లుగా రిక్షాపై కవిరాజు.

తమాషా-పుట 62 నిబ్బరంబుగఁజూడు నేడిదె నాతమాషా యటంచు చెలరేఁగి చాలనలసి (బళికలేజీ వేల్పు శతకము) తమాషు - అని గణపవరపు వెంకటకవి ప్రయోగించినాడు.

జవాను - ఎవరి జవానులు మీరూ, మీరెవరు పంపగవచ్చినారు- భద్రాచల రామదాసు కథ. పస్పు పచ్చళ్లు ఫారా జవాన్లు-పానుగంటి.

సరదా - తనయుని కోసకుంచు సరదాపడి కుంతి- గొట్టుముక్కల రామకృష్ణ శాస్త్రి

గుభాలున - 'గుభేలున' అని వాడుక. కవి దీనిని యతిస్థానములో వాడినాడు. భంగములై నభంబులు గుభాలునఁ ద్రెళ్ళగ - వరాహ పురాణము 8-86.

ఇంకను తిల్లిక - రాజీపడి - విస్తరాకు- అటకాయించు- సామాను సిరా - సవాలు - మొదలైన పదములు ప్రయుక్తములైనవి. ఇందులో తిల్లికపదమునుగూర్చి - 1930-31 లో వాద ప్రతివాదములు జరిగినవి.

ఈ గ్రంథమున ప్రయుక్తమైన మాండలికములు - స్థానికములును నగు పదముల కొన్నింటిని చూపుచున్నాను.

చిల్లీలు - ఆటలో గుండ్రముగా తిరుగుట
తుల్లముగ — ఎక్కువగా
గంగా బొండాలు - ఎలనీటి కుపయోగించు లేత కొబ్బరికాయలు
పెరుగు మామిడిపండ్లు - రసము పెరుగువలెనుండు మామిడిపండ్లు.
కట్టువలు - చెట్ల వరసలు
పుచ్చె - కొబ్బరిపిందె
తుంటు - ఆకులతో కట్టిన కాగడా.

ఇంకను పోదామని, ఒసగే బాధ్యతలు, అగుపించగుపించని, సేవించినాను, పాడినాను - మున్నగు వ్యావహారిక ప్రయోగములన్నియు నిందు రసవత్తరముగా పొందుపడినవి.

నిత్య వ్యవహారమునుండి నిర్భరానంద రసపారవశ్యమును గలిగించు కావ్యము వలననె ప్రదీప్తమగునది దీపము. అదియే ఆత్మదీపిక - మనుగడ దివ్వె - అది నిద్రాణమై నిస్తేజమై యున్నపుడు :

"మినుకు మినుక్కురంచు, కొడి మిక్కిలి గట్టుచు మేని గూటిలో
కునుకు చెడంద కుందియను గూర్చిన నూనియనూలు బొట్టులన్
మనుగడదివ్వె డాలెగసనంజన ద్రోసిరి నిండువెల్గగా
మనుగడ పొత్తమెల్ల పలుమారులు విప్పిరి తెల్గులైకె సరుల్."

(మించుపల్లి)

చైతన్యవంతము, తేజస్వంతము గ దీపసభా కావ్యమును సృష్టించిన జాతీయకవి, గేయకవి, మహాకవియు నగు భీమనకవి విశ్వకవి యైనాడు. ఆతడింకను నితోఽధికముగ నిట్టి కావ్యములు వ్రాసి తెలుగు సాహిత్య ప్రపంచమును దీపసభా విరాజితముగ జేయుగావుత మని యాశీర్వదించుచు, నాంధ్ర విద్వల్లోకము దీనికి సుస్వాగత మొసగునని విశ్వసించుచున్నాను.

ఒక్కశబ్దమె దీపమై పెక్కగతుల
హృదయ కుహరంబునది వెలిగించుచున్న
'దీప సభ' యాంధ్రలోక హృద్దీపకమయి
వెలుగ జేయదె వాఙ్మయ విశ్వజగతి.

భూపసభ మున్న కవితా
శ్రీ పరిణతి జెందినట్టి చిహ్నంబయ్యెన్
'దీపసభ' నేడు కవితా
శ్రీపరిణతి చెందినట్టి చిహ్నంబయ్యెన్.

నిడుదవోలు వేంకటరావు.

మద్రాసు.

# అభివందనాలు

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" అనిమతం. ఇక్కడ ప్రస్తావించబడింది నివృత్తి రూపమైన బ్రహ్మానందం కాక, ప్రవృత్తి రూపమైన రసానందం. ఈ ఆనందం రస నిష్ఠం. రసం సౌందర్య నిష్ఠం. సౌందర్యం వస్తు నిష్ఠం. కాగా, వాస్తవ సౌందర్యోపాసనమే రసస్పృష్టికి, ఆనందానుభూతికి సాధనం. ఈ సాధనమే నాయీ "దీపసభ" కావ్యం.

"అమ్మా! ఈ దీపాలన్నీ ఆరిపోయి, ఏమవుతాయి?" ఐదారేండ్ల ప్రాయమప్పుడు నేను మాయమ్మను అడిగిన ప్రశ్నయిది. దీనికి ఆమె ఆనాడిచ్చిన సమాధానమే నేటి యీ కావ్యలతకు అంకురం.

దీపం ఎక్కడనుంచి వెలుగుతుంది? ఎందుకు ఆరిపోతుంది? ఎక్కడికి పోతుంది? వెలుగుకు శాశ్వతత్వం ఎందుకులేదు? ఈ విచారం నన్ను దీపసభా ముఖంగా నడిపించి, తదపరోక్ష సాక్షాత్కృతితో బ్రహ్మానందంలో ముంచి, రసానందంలో తేల్చింది.

పూర్ణ వికాసంకోసం, సంపూర్ణ సాఫల్యం కోసం అజరామరత్వాన్ని కోరి చీకటిపై వెలుగు, చావుపై బ్రతుకు జరుపుతున్న నిరంతర సమర యాత్రే ప్రగతి. ఈ జైత్రయాత్ర పురోగతిలో ప్రతి యడుగూ నవనవోన్మేష సౌందర్య విలసితమే, ప్రతి విజయమూ నవజీవన సమావిర్భావ పులకితమే.

ఈ లక్ష్యాన్ని కోరి మానవుడు పురోగమించడానికి ప్రాథమికంగా అతడికి కావలసింది స్వేచ్ఛ, సమృద్ధి. ఈ రెంటికోసం "దీపసభ"లో సర్వోదయ సమాజనిర్మాణం ప్రతిపాదించబడింది. సమాజం దీపాధారం వలె స్నేహపూరమైనప్పుడు మానవుడు అఖండజ్యోతివలె జగజ్జేగీయమానుడు కాగలడని సూత్రీకరించబడింది. విశ్వేశ్వరి అయిన పరంజ్యోతి అధ్యక్షతను జరిగిన .విశ్వదీపికా పరిషత్తు (పార్లమెంటు) సమావేశంలో వివిధ పరిస్థితులకు, పరిసరాలకు చెందిన రకరకాల దీపాలు తమ ప్రత్యక్షానుభవాల దృష్ట్యా ఈ సర్వోదయ సమాజ నిర్మాణావశ్యకతను ఉద్ఘాటిస్తాయి.

## కృతి

సర్వశక్తులు, సర్వకాంతులు మానవునిలోనే కలవని, ఆనందరూప మగు రసబ్రహ్మ మానవుడేనని ప్రకటిస్తూ, రమ్యము, పారమ్యము అయిన ఆ మహోదయ మధుర రుచులలో ఈ కావ్యం పర్యవసిస్తుంది.

ఈ కావ్యంలో—వాడుకలోవుండి, ఛందస్సుకు లొంగివచ్చిన అనేక పరభాషా పదాలను యథేచ్ఛగా వాడాను. భావం, అలంకారం, వర్ణన మొదలైన కావ్యసామగ్రినంతా - ఇతివృత్తం వలెనే—సరాసరిని ప్రకృతి నుంచే సరిక్రొత్తగా, తాజాగా గ్రహించాను. అందువల్ల ఏవైనా లోపాలుండవచ్చును. సహృదయుల సానుభూతిపై ఆధారపడి దీనిని ప్రకటిస్తున్నాను.

ఎన్నో సంవత్సరాలుగా వ్రాతపెట్టెలో అడుగునపడివున్న ఈకావ్యం నేడు ఈ రూపంలో బైటికి రావడానికి అనేక విధాలుగా తోడ్పడిన మిత్రులందరికి—ముఖ్యంగా అమూల్యమైన "స్వాగతం" వ్రాసిన విద్యారత్న శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారికి, ముఖచిత్రం గీచిన శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి గారికి, శ్రీ నార్లవారికి, విద్వాన్ విశ్వం గారికి, శ్రీమతి బి. ఆదిలక్ష్మి గారికి కృతజ్ఞుణ్ణి.

శ్రీయుతులు వడ్లమూడి సత్యనారాయణ, పి. వీరభద్రరావు, వేముల కూర్మయ్య, వై. ఎస్. శాస్త్రి, ఆర్వాల సుబ్బారావు, బాబుఆంజనేయులు, రుద్రరాజు రామలింగరాజు, నున్న కన్నారావు, గోపరాజు సుందరరావు, ఎర్రాప్రగడ సత్యం, రాయుడు గంగయ్య, వడ్డాది వెంకటరావు గార్లకు, తదితర సాహితీ పోషకులకు వందనాలు చెల్లిస్తున్నాను.

మా జననీ జనకులైన నాగమ్మ, పల్లయ్య దాసుగార్ల పేరుతో తిరుపతికొండల దివ్య సౌందర్యశక్తికి ఈ "దీపసభను" అంకితము చేస్తున్నాను.

మామిడికుదురు }
కోనసీమ }

భీమన్న
1–1–55

# దీపసభ

## వెలుఁగు

ఏ పరంజ్యోతినో వెల్గి, యీ ప్రపంచ
విధులు నెరవేర్చుచున్న దివ్వెలము మనము;
దీపికా! నిన్ను నన్నొక్క వాపి ముంచు
నంధకారముపై దండయాత్ర మనది!

నీవు తరిగిన కొలఁది నీ నీడ పెరిగి
చిమ్మ చీకటిగా మమ్ము క్రమ్మివేయు,
నీడను విదల్చి నిండుగ నిల్చి వెలిఁగి
దారి చూపుము శాశ్వతత్వమున కీవ!

నగ్నరూపిణివై నీవు నాట్య మాడ
సృష్టి నీచుట్టు తిరుగు చక్రీకృతముగ,
తెరలు మార్చుచు, రంగులు దిద్దుకొనుచు
రక్తి కట్టింతు మేము నీ రంగ మందు.

భూమికి సూర్యబింబమును,
ప్రొద్దుకు ప్రాణము నీవె, మా ప్రియా
రామకుటీర జీవన స
రస్సున పూచితి వెట్లొ నేఁడు; మా

ప్రేమసుధామధూళి మధు
    రిల్లిన మోహనరాగ రశ్మినై
తామసమున్ హరించి, మము
    ధన్యులఁజేయుము, దీపికామణీ!

వాస్తవమ వీవు, నేనును వాస్తవమ్మె,
పరమశక్తికి రెండురూపముల మగుట;
లేదు పోగయుట ముగియుట లేదు మనకు,
నీ వి దేమిటి చికిలింతు వింతలోన?

లోకము నొక్కరీతి జతి
    లోఁ పులకించెడి దివ్యతారలే
యాకుల కప్పు వెల్తులకు
    నచ్చెరువంది, ద్రవించివచ్చి, మా
పాకను జొచ్చి, మా యిరుల
    పజ్జకుఁ బచ్చఁదనమ్ము నిచ్చె, ప్ర
త్యేకము నిన్నుఁ గొల్చి మము
    నేలక పోవుట నీకు భావ్యమే!

మా నెయును దెచ్చికొనలేని దీనచరిత
నంతలో కాల గర్భాన నార్పివైచి
ఒకరు కంటికిఁ గాన్పింప కొకర మేద్వ
నీవు మిన్నంటఁ దలపోసె దేల లీల?

నీ వున్నయింట లక్ష్మీ
దేవి వసించున్, దరిద్రదేవత మాతో
నీవున్న నోర్వకున్నది,
నీవు రమాసఖివి, గెల్వనేరవె తమసిన్ ?

తగులఁ బెట్టఁగలవు ధాత్రీతల మ్మెల్ల,
ఏలఁగలవు మమ్ముఁ బోలు వారి,
దారి చూపఁగలవు, దరిలేని యిరులలో
ముంచఁగలవు, నీకు ముదలలేదు !

మా దరిద్రముఁజూచి కృపాదరిద్ర
వై తరలి పోవనున్న నిన్నరసి, మాకు
జాలి గొనివచ్చి, యా గోడమూల మిణుఁకు
చిఱు మిణుంగుఱుఁ బుర్వు చూచితివో, లేదో ?

అది కొంతకుఁగొంతకు మా
గది నిండుగ వెలుఁగ కున్నగాని, కృపన్ నె
మ్మదిమించి మిణుఁకు చున్నది,
హృదయము గద వాంఛితార్థ మిల నెవ్వరికిన్ !

వెన్నెలల కోస మింటింట వెదకుచున్న
వంకతో నెలవంక నీ వంకఁజూచు,
నీ వొకించుక లోకువ నిత్తువేని
నవ్వుఁ బాటౌను నా చెలి నవసుషుప్తి !

కాంతా లోకములో నా
కాంతామణి నీకు సాటి కాఁగలదని లో
నెంతును, కొంచెము నేవీ
చెంతను వెలుఁగొందె నిజము చెప్పంగదవే!

కాంచు మదిగో, గోదావరి కాల్వలోన
పర్వులెత్తెడు రహదారి పడవ యొకటి;
అద్దమూడిన లాంతరు నందె నిల్చి
తెరువుఁజూపుచు నున్నది దీపి యొకతె!

గాలిఁ గదలాడు కదళీదళాల మీఁద
మధుకణమ్ములై తారలై మసల సాఁగె,
పూతమామిడికొలను కాఁపురములోన
సూర్యరశ్మియె చంద్రికా శోభనొందె!

మూఁడుక్రోసులు సంతకుపోయి, తిరిగి
యింటికిం బోవుచున్న దా యెడ్లబండి
తిమిరమున వెల్గు, నిద్రలో తెలివి లేక
కువలయము లక్ష్యముం జేరుకొనదు సూవె!

ఒంటిపాటున మన పొరుగింటి పంచ
పాళి నిద్రించు బాలెంతరాలి నులక
మంచముంజేరి పాప నాడించుచున్న
దివ్వెఁ గనియైన కరుణను దెచ్చికొమ్ము!

నీ రూపంబున సాక్షా
త్కారంబై పరమశక్తి కాలాబ్జములో
సారంగములగు మాకున్
ధీరతఁ గల్పించి, ద్వారదేశము కాదే?

ఎండ కోర్వని పెనుకాఱు బెనుముపోలె
కువలయము చీకటిం జొచ్చి కునుక సాఁగె
గంగిగోవుగ నది మేలు కాంచు వఱకు
కాంతి సుధఁ జిల్కి దానిని కడుగ వలదె?

తెమలక, యెట్టెటో, బ్రతుకుఁ
దెయ్యాలకుం బడి, యేదో విస్ఫులిం
గము నొకదాని నమ్ముకొని
కాలిడు పేదల మేము ; మా దరి
ద్రమునకుఁ దోడు మమ్ము నిటు
దారియుఁ దెన్నును లేని యంధకా
రమునన కూలఁద్రోసి, యవు
రా! పరువెత్తెద వే సుఖాలకో!

కలిమి లేముల తేడాలు కలవు ధనమె
మానవుని విల్వఁగట్టు సమాజమందు ;
ఆత్మరూపిణి వీవుగదా? ఇదేమి
చీఁదఱింతువు తైలము లే దటంచు?

తైలము లేదు, మేము నొక
దమ్మిడి యైనను చేతలేక, నీ
వేళకు పండు కొందమని
వెచ్చని నీటిని గ్రోలి, మేనులన్
వాలిచినాము ; నీవు కరు
ణాత్మక, వీ నిశమాత్ర మింత ని
స్తైలముగా వెలుంగుము, ప్ర
సన్నవు గమ్ము, ప్రసన్న తేజమా !

ఆరామమ్ముల, దూ్యతమందిరములన్
ఆహార సద్మమ్ములన్,
కారాగారములన్ ప్రజాళి బహు ల
క్ష్యాధీనులై చేరి ని
న్నారాధింతురు, శంకచేయ వెపుడున్ ;
ఆధ్యాత్మికుల్ తప్ప ము
న్నెరున్ జూడని స్వచ్ఛశీలములు మా
హృద్దీపికల్, దీపికా !

నింగికి చుక్కబొట్టు నిడి
నేలకు దీపముఁబెట్టి, దక్కిపై
ఖంగునగొట్టు విశ్వకథ
కాగ్రణి వీధికి మాకు దారి చూ

పంగల నీకునున్ భయము,
　　బాధయుఁ గల్గునె? నమ్మెట్లు? ది
వ్యాంగన కన్ను మూయఁగల
　　దా? పరమాత్మకు మృత్యువున్నదా!

లేని చోటనుండి లేచి వచ్చిన దివ్వె
ఉన్నచోట నేల యుండిపోదు?
లేని చోటులేని, లేచిపోవుట లేని
జ్యోతికేము పూజ చేతు మెపుడు.

## చీకటి

ప్రబల గాఢాంధకార గర్భమున మమ్ము
త్రోచి దీపము మాయమై తొలఁగె, లోని
జఠరవహ్నులు మాపైకి చొకళించి
బాహ్య జగమును రసముతో బావ్రకొనియె.

మా యెఱుంగని పసిపాప మాతృదేవి
ప్రక్కలోవలె, నా ప్రక్కఁ బరవశిల్లి
గాఢనిద్రకు సతి యలంకార మయ్యె,
లేదు చీకటి, వెలుతురు లేదు తనకు!

మందమారుత మొక దొంగమాడ్కిఁ జొచ్చి
తడుమసాఁగిన దేదో నా తనువు మీఁద,

నింగిఁ జను చుక్కయొక్కటి తొంగిచూచి
తనకుఁ గానట్లు ప్రక్కకు తప్పుకొనియె !

చూచివోయి నేనారీతి, శూన్యము నయి,
చిమ్మచీకటి లోయల చెదరిపడిన
విమల జలపాత మట్లు వ్యాపించినాను
సత్తు చిత్తుల చెలువంపు సందులందు !

ఒక హఠాన్నవ్యనైశ్చల్య ముండియుండి
బుద్ధు నొక్కని నాలోన నుద్ధరించె !
ఏ నజంతా గుహాంతర ధ్యానముద్ర
బండవాఱిన విశ్వకరండ మైతి !

లేదు స్మృతినాకు, కదలించ దేది నన్ను,
పరమపరిపూర్ణ నిర్గుణబ్రహ్మ నేను ;
నేనె స్మృతి, నేనె చేతన, నేనె సగుణ
ప్రకృతి ; ఇదియేమొ నా కపూర్వ ప్రతీతి !

ఏతదవ్యక్త మధురానుభూతి నన్ను
ఎంతకాలము పాలించె నెఱుఁగరాదు ;
క్షణములో నేదొ పరమాణుశక్తి నాకు
కోటియుగముల బరువుతో గుండెఁ జొచ్చె !

పగటి వెలుఁగెల్ల మేసి, తృప్తిగ పరుండి,
నెమరు వేయుఁగసాఁగె సంతమసమహిషి ;

కరఁగి పసుచుండె నిందందు నుఱుఁగు ముద్ద
తారకలుపైని, క్రింద కల్హారములుగ !

తారకలనుండి కాంతి చైతన్య బలము,
కలువలందుండి వాసనా బలము వీచి
తనువు మార్చి ధరించిన తపసి వోలె
క్రొత్త బలమేదో నాలోన కుట్మలించె !

వెలుఁగేమిటి కుదయించును ?
వెలుఁగేమిటి కారిపోవు ? వెలుఁగునకును వే
వెలుఁగునకు నడుమ నింతటి
ఖలమేమిటి ? దానిలో నఖల మేమిటికో !

వెలిఁగింప వెలిఁగి, తైలము
కలిగిన కానంతసేపు కాంతి నొసఁగి, యా
వల మాసిపోవు దివ్వెకు
ఫల మేమిటి ? వెలుఁగు కిట్టి బ్రతుకేమిటికో !

## ప్రగతి

రెప్పపాటున దీప మారినదో లేదో
కాంతి కణమొండు లేచె నాకాశమునకు !
అవని సమతకుఁదెచ్చు విప్లవమునుండి
అభ్యుదయ మందు నరుని శ్రేయస్సువోలె !

కన్నును మన్ను నేకముగఁ
గల్పిన చీకటి నుండిలేచి, య
భ్యున్నత దివ్యమార్గమున
బోవఁగడంగిన దార దీప! మే
మున్నదొ పైని మా యెదల
నుండని రమ్యత, చూత మంచు, నే
కన్నులు మూసికొంటి, నొక
కాంతి లవమ్ముగ మేలుకాంచితిన్!

పై కెగసెను నా దీపము,
పై కెగసితి నేను నొక్క పర్వేందుకళా
శీకరమై, సకలాశా
శ్రీకరమై, సిద్ధిరూప సీమాకరమై!

వనకాంత చరణ నూపుర
మణిమంజరివోలె చాల మహితంబై, నా
దనుకొన్న కొంప చుట్టున్
మిణుఁగురుఁ బుర్వుల శతమ్ము మిలమిలలాడున్!

అగ్నిపర్వత వదన మట్లావులించి
పండుకొన్నది మాయింటి ప్రాఁత కప్పు!
త్రోవఁబోవుచు మా కేసి తొంగిచూచి
ఉల్క యొక్కటి భూమిపై నుల్కిపడియె!

మా రెండు శరీరమ్ముల
కారయగా నే నొకండ నధినాథుఁడ, నా
యారాధన పెంచిన ప్రే
మారామపుఁ బంటనేఁటి కనుభవ మయ్యెన్.

చేవగల యంత సేవను సేవచేసి
పుడమి వాసనలు విదల్చి పోవుచున్న
నాదు పూరింటి చిఱుదివ్వె పాదములకు
భాగ్యసౌధాల దీపాలు ప్రాంజలించు!

ముందు ప్రమిదెలు, మణిదీపములు, ననంత
రము తటిద్దీపికలును దూరమున మున్గి
మాటు మణఁగెను; చీకటి మాత్రమేదొ
కుమ్మరావము రీతిగా కుములసాఁగె!

పోవు కొలఁదిగ కొంగ్రొత్త పూవులట్లు
శతసహస్ర మనోజ్ఞ విశ్వములు విరిసె!
దూరమై పోవుకొలఁది నుదారమగుచు
భూమి యొక తారయై ప్రభాపూరమయ్యె!

నా వెనువెన్క జిమ్ము మను
నాదము తోడ పరిభ్రమించు ధా
త్రీవలయమ్ముఁ జూచెదు గ
తిన్ గనుఁగొంటిని —నీడలేని నా

త్రోవ ప్రకాశమానమయి
తోఁచెను! నాకు స్వయంప్రకాశ మి
చ్ఛా విధి నబ్బె, లోక నయి
జమ్మున కేను సుదూర మాటచే!

"ఓ" యన "కో" యనన్, కుహూకుహూ
నవనాదపుఁ బల్లకీలలో
నూయెల లూఁగు కోయిల న
వోఢల కౌఁగిట, బాలపల్లవ
చ్ఛాయల లోన ప్రేమ పరి
చర్యలఁ జొక్కు వసంతదేవుఁ "డో
హో" యన జాలు దివ్యసుఖ
మొందితి నేను పురోగమించుచున్!

మనుజుని గుండె గాయములు
మాన్పక, కారముఁ జల్లునట్టి పెన్
దనుజుల ఘోర నవ్వులును,
దావున పీడిత కోటిమూల్గులున్
వినఁబడ వింక నాకు; ఒక
వీధిని మేడలు, పూరి కొంపలున్
కనఁబడ వింక, క్రొత్తపద
కమ్మున నే నిపు డేఁగు దారులన్!

తారాజువ్వను బోలి లేచి, భువి బం
ధంబెల్లఁ బోనాడి, యా
తారావృత్తము లెన్నియో గడి, చనం
తంబైన పెన్ బైలులో
ఆ రేయో, పగలో యెఱుంగుట కసా
ధ్యంబౌ మహావ్యక్తమం,
దే రేవెల్గుల ముద్దొ నాఁగఁ జనె నా
దీపంబు దే దీప్యమై !

లంక బీడుల వాఁగుల వంకలందు
చాలు పోసిన చిఱురెల్లు పూలనంగ
బాఱులుగ తీరి దివ్వెలు మేరమీఱె
రజనివీధుల నేడా కేంద్రమును గోరి !

సఖిని వెన్నంటి పయనించు సఖుని పోలె
లీలఁబోవుచు నేను విశాల విశ్వ
నవ్యశోభల కగుపించి నా, నపూర్వ
దివ్య సౌందర్య రుచులకుఁ దెలిసినాను !

క్రింది మీఁదులు లేని యా సుందరాంత
రాళమున నేను పయనించు వేళ, నాకు
ఉడులు మిణుఁగురుఁ బుర్వులై యొరసికొనును
తెఱువు చూపు నిసుల్ వీధి దీపములుగ !

తేజో మేఘులవమ్ములు
తేజీలై తేలిపోయి, దివినొక్క శరత్
శ్రీజదధి మున్గిపోతిని,
ఏ జీవికగాని వెలుఁగు నింకితినంతన్ !

అంతవఱకే నెఱుంగని కాంతి నన్ను
కాంచినంతనె తనలోన గలుపుకొనియె,
నే ననున దంతమైపోయి, నిరుప మామృ
తామృ తార్ణవమే సర్వ మలముకొనియె.

అపుడు వికసించినది మనోహర విమోహ
నారు ణారుణ నవ కోకనద మొకండు,
రాగరుచి పద్మరాగ సౌరభ్యమేదొ
నను సమాకృష్టుఁ జేసికొన్నది బిరాన !

## పరిషత్తు

అది దేవసభకు దీవ్యద్దివ్య దీపాళి ?
స్వర్ణాద్రి కంట కజ్జలము నొరయు,
అది చిత్రకళకు కళ్యాణవేదిక ? బాల
గంగాధరునకు వీరాంగ మొసఁగు ;
అది యుషస్సునకు సంధ్యారాధ నాంజలి ?
రాగోదయమునకు రంగు దిద్దు !
అది స్వయంప్రభకు పర్యంకమ్ము ? పుండరీ
కములకు వెన్న బువ్వములు పెట్టు !

అది శరచ్చంద్రికకు సమాహ్లాద కరవి
లాసలీలా విహారకల్హార వీధి ?
అది జగజ్జాలములకు మహామహేంద్ర
జాల రచనాప్రచేతనోజః పయోధి ?

కార్తికపూర్ణిమా కమనీయకాంతి,
హేమంత తరళ తారామందకాంతి,
గ్రీష్మాపరాహ్ణ వారిజమిత్ర కాంతి,
కాంతు లిన్నిఁటి కిందు కల దేదొ విందు !

కాయమ్ములను వల్లకాటిలో త్రుంచి
శుభ్రాత్మ లిటవచ్చి సుఖయించు నేమొ !
మముబోంట్ల నంధకారములోన ముంచి
ఎలమి నాశాజ్యోతు లిం దాడుకొనునొ !

అమరాంగనలఁ గెల్చి సుమసాయకములు
తెచ్చిన విప్లవ తీర్మాన మేదొ
విశ్వరూపము దాల్చ విప్పారె నన[ఁ]గ
దీపకాంతల సభ దివ్యమై యొప్పె !

దీపములు రూపములు లేని తేజములుగ,
పాలు పట్టియు పట్టని పాలజొన్న
పొలము వెన్నెలలోవలె, కొలువుతీరె !
మధ్య చెలువారు నొకదేవి మంచె పైని !

అగుపడదు దేవి తన దీప్తియందు తానె,
ఆమె లీలాతనూవల్లికా మనోజ్ఞ
వైఖరుల కాంతిరేఖల వంపులందు
వాడవాడల దీపాలు నీడలయ్యె!

క్షీరసాగరమున పంచదార పిసరు
పోలె నాదివ్వె లీనమైపోయె నందు!
అపుడు సభ మాధురీపూర మై యనంత
పూర్ణిమల శోభతో పరిఫుల్లమయ్యె!

తుల్లముగ పూచు మరుమల్లె తోటలోన
ప్రొద్దు తిరుగుడు పూమోవి ముద్దుగానెడు
సంజకెంజాయరీతి విస్ఫారమయ్యె
దేవి దరహాస వదన కాంతి స్రవంతి!

ఆమె యీ మహాసభకు నధ్యక్షురాలు,
అది జగన్నాటకాభ్యంత రాలయమ్ము;
తిమిరమును దీసి, కాంతిఫేనమున గడిగి,
దివ్వెలను జేసి పంపించు దేవి యామె!

పొలముల మోటఁగట్టి జల
 ముల్ పలుదారుల, పెద్దచిన్న బో
దెలఁ బ్రవహింపఁజేసి, పువు
 దీవలు, తోఁటలు పెంచు మాకృషీ

వల సతివోలె — ఆమె ముఖ
పద్మము వెల్వడు కాంతి ధారలన్
వెలయఁగఁ జేయు విశ్వమున
వీతి వినూతన చేతనప్రభల్ !

విశ్వహృదయ మామె, విశ్వాంతములు తాఁకి
అలలు వేయుచున్న వాత్మదుచులు ;
ఈఁదు లాడుచున్న వాదిత్యగోళాలు
కాయకష్టమందు కాంతులూర !

ఉద్గమించు నామె యుచ్ఛ్వాస నిశ్వాస
మందమారుతాల మాధురిమలె
బ్రహ్మచేతి బొంగరాల జాలీసులు,
దాఁటరాని మేటి యాట గిరులు !

విమల జీవనకాంతి సూత్రములతోడ
ఉర్విగోళము లల్లుచు నుండి యామె
తళ్కు మన్నట్టి రొుక తటిద్భావ మందు
నాకు నాకాంతవలె తోఁచి నవ్వుకొంటి.

పచ్చికుండకు రంగు పట్టించు చున్నది,
అతివ స్వేచ్ఛకు స్వేద మంకురించె
సరమున నల్లపూసలు గ్రుచ్చుచున్నది,
కోరమీసము కట్టుఁ గొయ్యఁజేరె !

గోడకు పసుపుఁ గుంకుమ పెట్టుచున్నది
పరమేశు నెద్దులు పండుకొనియె
ఆటబొమ్మకు నందియలు గట్టుచున్నది,
పుడమి బంతికి కంప ముదయమయ్యె !
రేయి పవ లించుకంత తీరికయె లేక
పనులలో మున్గియుండు నా పడఁతి మిన్న
విమల దరహాస కిరణమై విరిసి నేను
విప్లవమ్ముగఁ గైకొంటి విశ్వమయత !

కోటి సప్తాశ్వ రథవేగ ధాటి నేను
ఆమె శతకోటి పూర్ణ చంద్రాతపమ్ము,
లోకములు గెల్చుకొంచు పుకోగమింతు
నేను, ఆలన—పాలన నెసఁగు నామె.

నిమిషములోన నట్లు కమ
నీయత విశ్వమయత్వ మొంది, దై
వము నయి, తోఁటలందు తొలి
వానలకున్ మొలకెత్తు రమ్య పు
ష్పముల విధాన నేను పలు
చందములన్ విహరించి, నవ్యలా
స్యము నొనరించి నాను సభ
సర్వము నాకొక హంగుకతైగా

చిల్లీలు తిరిగె మాతో
ఫుల్లాబ్జ సరోవరాలు, పూర్ణేందు నభా,
ల్లుసిత బ్రహ్మాండా
లుల్లమ్ములు పొంగి మనము లోరయుచు నంతన్.

సుందరమ్మైన యా రసానంద మందు
ఆమె, నే నన్నదై ్వవిధ్య మంతరించె;
హాయిగా నేను కనుమూసి రేయి కాఁగ
విస్ఫుర స్నాన దివముగా విరిసె నామె.

ఆ హిమజ్యోతి—వికసితోద్యాన వాటి
చందమున వెలుఁగొందెడి సభను గాంచి
ప్రశ్న చేసెను—"మనుజ ప్రపంచ మందు
వార్త లేమమ్మ, దీపికా వ్రజములార!"

పచ్చని వరిచేల పసిఁడి గింజల తల్లి
బిడ్డల జోకొట్టు ప్రేమగీతి
మామిడి పూలలో మత్తిల్లి మధుపాయి
పికమును రెట్టించి పిలుచు రవళి
వైశాఖ పూర్ణిమ వాకిట చేరిన
మల్లెపూమొగ్గల మాట మంత్రి,
కొండలపై నాడుకొనుచుండు సెలయేళ్లు
లేళ్ల ముట్టెలను లాలించు సరళి,

మేళవించిన వామె గంభీర మధుర
గళ విపంచికపై భావగతి చలింప,
లలితమై యామె యధరపల్లవము కదలి
కదలె దీపాల యెదలు పయ్యెదలు నంత.

ఆ రమణీయ దీప సభ
యం దరుణోదయ మట్లు దేవి ప్ర
శ్నారవ మేదొ మేల్కొలుప
సాగెను ; చీకటి జాతి, తెల్వికిన్
జేరిన లోక గాథలను
చెప్పగ లేచెను దీపముల్, నమ
స్కారముచేసి తల్లికి, వి
కస్వర క్రమ పికస్వరమ్ములన్.

స.రి.గ.మ.ప.ద.ని.సలను కి
న్నెరపై నొక్కొక్కదాని నే పలికింపన్
దొరకొన్న వాణి లీలన్
బరగిన దా దేవి దీపవాక్కులు వినుచున్.

---

# దీపసభ

## మైనపు దీపము

మైనపుం జిఱువత్తి నా మేను దాఁకి
కన్ను తెరచితి నొక బాల కంటికొసల,
ముద్దు లొలికెడు దాని కెమ్మోవి నుండి
రాలె నను జూచి నవపద్మరాగ రుచులు!

ఆమె కూర్చున్న దొక్క కృష్ణాజినమున,
చేత నున్నది లేఖని చేష్ట లుడిగి,
తెల్లకాగితముగ చిత్తమెల్ల పఱచి
సరసభావమ్ము దేనికోసరమొ వెదకు!

శూన్యమున భావ మొకరీతి నున్నకాఁగ,
గీయ దొరకొన్న దామె లేఖనియె నన్ను!
చపలచిత్తము విడిచి నిశ్చల సమాధి
నన్ను నేఁ జూచుకొనుట కానందపడితి!

ఒకనాఁటి సౌఖ్యమేదో తుపానుగ రేఁగి
కరఁగిన కన్నీటి కణములోన,
అలనాఁటి క్రీడ లేయవో తరంగితముగా
మీటిన కనుపాప మెఱుపులోన

తొలినాఁటి నేవో ముద్దులు జ్ఞప్తికిన్ వచ్చి
తడిసిన చెక్కుటద్దమ్ములోన,
కలనాఁటి విభవంపు తలఁపులేవో చలింప
పులకరించిన ముక్కుపుడకలోన,
అప్పటప్పట నొక్కొక్క యర్ధరాత్రి
కల్గినది నాకు నన్ను నేఁ గాంచు భాగ్య,
మేల నొక్కొ కళాతూప మిచ్చినంత
పారవశ్యము నే నెందుఁ బడయనైతి!

మనుజుఁడు సృజించి ప్రకృతి గుమ్మాన నిడిన
యద్దమిది, దీన తనుదాన దిద్దుకొనుచు
ప్రగతి సాఁగించు నెల్ల ప్రపంచకమ్ము,
చిత్రకళ కెంత రసభావ సిద్ధి కలదు!

అంధకారమునుండి యాశలు వికసింప
రేఁగిన చేతనా రేఖ యనఁగ
చైతన్య మందుండి జగతి ప్రవర్తిల్ల
పొటమరించిన బీజమో యనంగ,
బీజ ప్రకృతినుండి పృథ్వ్యంతరములకు
సారించఁ బడిన శ్రీచక్ర మనఁగ,
చక్రాగ్రమందుండి స్వచ్ఛవీణాగాన
కిరణాలు ప్రసరించు కృతియనంగ,

తానె తన గూడకడ నుండి తప్పుకొనఁగ
యత్నమున్ జేయుచున్న విశ్వాత్మ యనఁగ,
వివిధ దశలందు నన్ను రూపింపఁజేసి
చించివేయుచు నున్నదా చిత్రలేఖ!

గజ్జెగట్టిన నటరాజు గద్దె ముందు
గీత గీతకు రసపాక మేతమెత్తి
అందు తానును బ్రవహించు నామె మ్రోల
గోడపై నంతలో నేవో నీడ తోఁచె!

అతఁడే ప్రసన్నుఁ డయ్యెనో,
అతనుఁడె తనుఁడై ప్రసన్నుఁడయ్యెనో, రతుఁడై
సతిఁజేరి యువకుఁ డొక్కఁడు
నుతియించెను బొమ్మచాల నూతన మంచున్!

ఎదుటన్ నిల్చిన నన్ను జూడఁ, డెదియో
 హేలా మనోవృత్తి సం
పదమై నావలెనున్న గీతలను స
 మ్మానించు పో మానవుం,
డిది రమ్యమ్ము కళారహస్య మిది, త
 ల్లీ! విశ్వకల్యాణ మిం
దుదయమ్మౌను రసోర్జమై, మధురమై,
 యున్మేషమై, దివ్యమై.

తెరవ రచించిన గీతల
నొరవడిగాఁ జేసికొని, వయో రూప గుణా
భరణముల దిద్దుకొంటిని,
గఱచితి లక్షణము దాని కరలక్ష్యమునన్.

వరమిత్రుఁడో, గురుదేవుఁడో,
పరమేశుఁడో — అతఁ డామె పజ్జకుఁ జని, ము
వ్వురు మూర్తిగొన్న ప్రతిభా
పరిపక్వతఁ బడఁతి కిట్లు పాఠము చెప్పెన్ :

" ఉన్నదానిని యున్నట్లు లుంతు మేని
స్వర్ణమునకైన విలువలు సమసిపోవు,
వాస్తవమ్మైన దానికి వాదమేల ?
త్రోసి విడువుము పుడమికందుకము నింత.

" వ్రాసి, రంగులువేసి, రమణీయ మొనరించి,
నచ్చక కొన్నింటి నలిపి వైచు,
అమృతగానము చేసి, యువనుల రంజించి,
శ్రుతిదప్పె నని వీణఁ జితుకవైచు,
నవకావ్య మూహించి, నాటక మాడించి,
బాగులే దని చించిపాఱవైచు,
రాసులం జెక్కి, తారాచైత్యముల్ కట్టి
ఉలి మొక్కవోవగా నూఁదివైచు,

ప్రాఁత యింకెందు కని త్రోచివైచు, క్రొత్త
అభిరుచికి తూఁగ లేదని ఏమాఁపివైచు,
విశ్వవిభుతయె యొక్కొక్కవేళ, కాను
వృద్ధిహేతువు నిర్దుష్టకృషియె, చాన

" అంచున గూరుచుండి, బయ
లందున గోర్కెలు క్రమ్మరించి,
ర్మించుము నూత్నమాధురులు,
ప్రేమ రథమ్ములు, భావసేతువులు;
మించులఁ బోలు మానవుల
మిందెరలన్ నడిపించుకొమ్ము నీ.
కుంచెకు నడ్డులే, దలము
కొమ్ము చరిత్రను, చిత్రకారిణీ!

" నీతివిదులు నిన్ను నిందించవచ్చును
ప్రభుత నిన్నుకించపరచ వచ్చు,
ప్రగతి చూచి త్రుళ్లిపడువారి లక్ష్యమ్ము
నీకు లేదు, సాఁగనిమ్ము రచన !

" ఇంకను కుట్టుకుంకలె ? యి
సీ! పనిపాటులు చేతగాక, ఈ
కొంకిరి గీఁత లేమిటికి ?
కూడును గుడ్డ నొసంగ నేర్చునే ?

లంకలు దున్నబోం డనుచు
లావుగ నే వ్యవహార వాదియో
మంకుతనాన నిన్ను నవ
మానముచేసిన, బెంగటిల్లకే !

" చేతికి లభించు వస్తు విశేషముందు
మనిషి గుండెను కఱఁగించు మంట లేదు,
మూసలో నవ్యవస్థను ముద్దచేసి
తీర్చిదిద్దుము రమణీయ దివ్యభావి !"

అనుచు నతఁడు ప్రసంగించు నవసరమున
గోడలందుండి యెవో గుసగుసలు రేఁగె !
నాట్యభంగిమ మార్చుచున్న నటరాజు
మోములో నింత చిఱునవ్వు మొలకరించె !

అవనీంద్రనాథుచే నమృతమ్ము గ్రోలిన
ఉమచేతి నాగేంద్రుఁడున్ను రనియె !
సునయనీదేవి కస్తూరి దిద్ది పంపిన
గోకుల కృష్ణుండు క్రోవి నందె !
మహికి దామెర్ల రామారావు దింపిన
రాగోదయము పొంగి రవిని ముంచె !
రవికవీంద్రుని కావ్యరసములో కఱఁగిపో
యిన ప్రేయసుల కన్నులెత్తఁ బడియె.

కచ్ఛపి చలించి తారలో ఖంగు మనియె!
పద్మ పద్మాసనమ్మునఁ బవ్వళించె!
ఎంద రెందరో మలఁచిన యెన్నియెన్నొ
సుందర కళాకృతులు వారి చుట్టుచేరె.

చిత్రశాల శాల చైత్ర రథమ్మొకట-
జైత్రయాత్ర గదలు చందమొప్ప,
ఆ మహోత్సవమ్మునందు తా మొక్కరై
సఖియు సఖుఁడు పూజ సల్పినారు.

చెల్వంపు లేపాక్షి చీరను గట్టి ప్రా
యము దిద్దుకొన్న వయ్యారి బాల,
లలి నజంతా నేత్రముల కాటుకను తీసి
వాల్జడ గైకొన్న వరకుమారి
హంపి వీధి మొగాన నవతరించిన నంది
మూఁపురమ్మున రొమ్ము మోపిన సతి,
నటరాజు గురువుగా నడక నేరుచుకొన్న
లలిత కళార్థ సంకలిత లలిత
అమర నమరావతీ గృహోద్యాన మందు
ప్రణయ నృత్యము సల్పు నప్సరస లోని
పరమ సౌందర్యసార స్రవంతి యామె
మైమఱచి యాడె నా కళామందిరమున.

అల బలి ద్వీప యవన మండల పరీత
ప్రాచ్యపాశ్చాత్యదేశాల ప్రతినిధులుగ
మందిర మలంకరించిన మహిత చిత్ర
రాజములు కళ కర్థాలు వ్రాసికొనియె.

అందమె మూల మీ ప్రకృతి
కంతకు, దాని ప్రతీ నరమ్మునన్
చిందులు ద్రొక్కు ప్రేమ రస
సింధువు, రమ్యకళార్ద్రభావ నేం
దిందిరమే తదీయ సుమ
నేందిర డెందము విప్పి జీవి కా
నందము పంచు నీ కొలువు
నన్ నిను లోక మెఱుంగఁ జూపుచున్.

నీ మధుర వాక్కు వినఁగా
నీ మోహన మూర్తిఁ గనఁగ, నిన్ను మనోజ్ఞ
ప్రేమమున బల్కరింపఁగ
ఏ మున్న దుపాయ మొక్క టిల కళ తప్పన్ ?

వీణ వినిపించు నీ గృహోద్యానమునకు
ఘల్లుమని మ్రోయు నీ పాద ఘట్టమునకు
రసము చిప్పిలు నీ యంతరంగమునకు
రమ్య మార్గమ్ము నవకళారాధనమ్ము.

ప్రాంత గోడల క్రొత్త చిత్రములు నిల్పి,
అవి నమూనాగ సరిక్రొత్త యందములను
సృష్టిచేయుచు నున్నదా చివురుఁబోణి,
ముద్దు బిడ్డలు తన యొడి మూఁడు కళలు.

భారతిని తీర్చిదిద్దెడు బ్రహ్మవోలె
ఆతఁ డగుపించె నా కంటి కా క్షణాన,
నాఁటి మీ పురాణము కాదె నేఁటివఱకు
త్రిప్పుచున్నది క్రొంబుటల్ తెలుపిలేక

ప్రతి పురుషుఁడు బ్రహ్మయొ, ప్రతి
సతియు సరస్వతియొ, నాఁటి సారస్వత మీ
గతి వాస్తవ మగు నేఁటికి
క్షితి ముందుకు పోవునిట్లు శ్రీమంతంబై !

---

# దీపసభ

## బండి దీపము

లేదు విషయమ్ము, భాషయు రాదటంచు
తిట్టవల దెవ్వరును, బండి దీప మేను ;
పరిసరాలకుఁ గేలెత్తి, శిరసు వంచి,
ఉన్నదున్నట్లు నాగాథ విన్నవింతు.

బండి యది, ఒక్క గుఱ్ఱపు బండి, సాఁగి
రేవునుండి పై రేవుకుఁ బోవుచుండె ;
నాల్గు జేవల తోఁట్టెలో మూల్గుకొంచు
పురుషు లైదుగు రెట్టిటో యిఱికినారు.

తిరుపతి వేంకటేశ్వరుని దర్శనమయ్యె
తలపైని బరువిప్ప తొలఁగె నంచు,
తప్పుడు సాక్ష్యమ్ము దావాను గెలిపించె
ప్లీడరు లోని గొప్పేమి టంచు,
లంచ మిచ్చినగాని లాభమ్ము లేదయ్యె
దొంగసారా కేసు దొరికె నంచు,
పండంటి పిల్లను పచ్చి రాడీ కిచ్చి
కొంప మీఁదకుఁ దెచ్చికొంటి నంచు,

ఎవరి గొడవను వారట్టు, లెదుటివారు
విందురో లేదో యనులెక్క విడిచిపెట్టి,
చెప్పుకొన దొడంగిరి మఱజీవు లట్లు
బండి యిరు చక్రములు వంత పట్టుచుండ !

కిఱకిఱ మని నెఱువ్రాసలు
విఱిగెడు గతి బండి కుదిపి విడిచిన, నాల్కన్
గఱచుకొనె నొకఁడు, తలపై
పొరచిట్లిన దొకని, కొకని మునిపం డ్లూడెన్ !

ఆఁగదు బండి, తోలు నతఁ
డాఁపఁడు బండి, తనంత గుఱ్ఱమే
లాగును బ ·డి ; లోపలఁగ
లట్టి యభాగ్యులు " అమ్మో ! బాబో " యం
చూఁగిసలాడ—ఘెల్లు మను
చున్ గొరడా ఝుళిపించి, మధ్యలో
వేగము పెంచి, స్వారి నడి
పించు ! నిషా తలకెక్కి నట్టిఁడో !!

నల్లకంకఱ రోడ్లపై నడచు నేని
యముని మహిషంపుఁ బెనుడెక్కలైన విఱుగు,
అల జగన్నాథ రథచక్రములును బెనుకు ;
మాతలికి కూడ గుండెలో మంటపుట్టు.

ఎత్తి కుదవేసి నప్పుడు
మొత్తముగా బంశి బండి "మొట్రో" యనుచున్
మొత్తుకొను, బోర్డు పనులన్.
గుత్తకుఁ గొనువారి నెంచి గో లెత్తుకొనున్..

కుదిపిన యష్టౌ మాత్ర మిటు
గోలగ బండిని, బండి వానినిన్
గదుముచు, రోడ్లఁ దిట్టుచు ; తు
ణమ్మున నంతయు విస్మరించి, పా
రదొ తన యెత్తటంచు—దిగి
రాఁడొకొ మున్నబు చూతు నంచు, మా
పెద నీఁక మచ్చునంచు తెగ
ప్రేలుదు ; రాఁపరు, నాఁగ రొక్కరున్ !

అంతయుఁ దామే చెప్పుచు,
నంతయు పెటిగోడు చెవికి సోఁకని పెద్దల్
పంతమునకు బండెక్కిరొ ?
గంతలు గట్టుకొనినట్టి గానుగ యెడ్లో !

అతని పెద్దత్త మేనల్లుని చిన్నమ్మ
అన్నపూర్ణమె యైన నౌనుగాక
ఆమె యైదవ పుత్రుఁ డాంగ్ల దేశము పోయి
తెల్లామెఁ దెచ్చిన దెచ్చెఁగాక,

నెలకు ముయ్యేడు వందల జీతముం గొంచు
దొరవోలె తన బావ తిరుగఁగాక,
సురభి కంపెనిలోన సుగ్రీవుఁడై తానె
ఉదధి దాఁటిన దాఁటి యుండుఁగాక,
తనకుఁగల బాధలో తాను మునిఁగియున్న
ఎదుటి వాని కుపాయ మిం దేమి గలదు ?
పరుల కష్టముఁ దీర్పఁ దోడ్పడఁడు కాని
చాటుకొనుచుండు నరుఁ డిట్లు స్వాతిశయము !

ఎచ్చట బండెక్కిరి ? వా
రెచ్చటఁ దిగువారు బండి ? ఏ వెలుఁగునకై
ఇచ్చీకటిఁ బడి పోదురో !
పచ్చీసును బోలు వారి పైనము, తల్లీ !

శ్రీపుర మ్మొక్క, రొకరు పిఠాపురమ్ము,
ఒకరు తిరుపతి, గోల్కొండ యొక్క, రిట్లు
పరిచయము లేని వా రొక్కబండి నెక్కి
సొంత గొడవలు వెళ్ళబోసుకొను చుండ్రి !

చాల సేపయ్యె సూర్యుఁ డస్తగిరి చేరి,
నిద్ర మునిఁగెను నిద్ర గన్నెరుచెట్లు,
చెట్ల కంటించఁబడి కొంత చినిఁగియున్న
వేవో పోస్టర్లు చాటింపుచేసి కొంచు.

టూరింగు సినిమాలో,
ఏ రాష్ట్రపు మంత్రి పర్యటించునో, కాంగ్రెస్
వారి ప్రదర్శనమో, ఏ
నారీమణి నాట్యమాడ నరుదెంచినదో !

బంగరు సంధ్యారాగమున
బాడవ లోపలి జొన్న చేలలో
చెంగలి గడ్డి కోసికొని
చెల్వ యొకర్తుక బాట ప్రక్కని
లైం గనుగొంచు దూరమును,
చివ్వన కళ్లెము లాగి బండి యా
బుంగను లోన బెట్టుకొని
పోవు, నదెక్కడి ప్రక్క బేరమో !

కొంతసేపటిలో చెంత పుంతలోన
నొక్క వృద్ధుడు దిగె, నిద్ర రెక్కనారు !
ప్రక్కనే గల చీకటి పల్లెలోన
ఇద్దరే దిగి మరి ముగ్గు రెక్కినారు !

గోన బస్తాలకన్న త్రొక్కుడుగ నరుల
బండి కెక్కించుచున్నాడు బండివాడు
తన కిరాయికి మించి ప్రధాని కైన
విలువ గలుగ దాతని దృష్టివీధిలోన.

బండి కిటకిట లాడుచు బైలుదేరె,
బైట చీకటి పాటలు పాడఁదొడఁగె,
దిగుట తక్కువ, యెక్కుట దిట్ట మగుట
గుఱ్ఱమును మాటిమాటికి కుంటసాఁగె,

రోడ్డు నడుమను జేరి తీసుబడిగాఁగ
కునుకు కుక్కలు మాబండి కొక సమస్య,
బండి కావచ్చు రావచ్చు బస్సె,దాని
తాత వచ్చిననున్ కుక్క తప్పుకొనదు.

ఎదురు వచ్చిన బండి నెవరుండిరో కాని
సాటి లాంతరు కన్ను గీటిపోయె,
వెలఁది నొక్కతె బైసికిలు మీఁదఁ గొంపోవు
యువకుఁ డెవ్వండొ నన్నుఱిమిచూచె,
ఓవరు లోడుతో నోపిక చచ్చిన
బొగ్గు బస్సుకు కళ్లు భగ్గుమనియె,
దూరదేశమునుండి దొంగమాటలు తెచ్చు
లాఱీకి నిలువెల్ల లావు బలిసె,
రెండు గుప్పెళ్లఁ దన యహంకృతిని దీసి
జనుల కన్నులలోఁ గొట్టుకొనుచు వచ్చె
ఱివ్వుమని యెవ్వరిదో చెవఁగొట్టు కారు,
కొంచెమున జావు తప్పెను గుఱ్ఱమునకు !

కారును జూచి బస్సు, జట
కాను కనుంగొని పాదచారియున్
కారము నూఱు కొంచు పయ
నమ్మయి పోవును రోడ్ల వెంట; నీ
మా రమణీయమూ నొక వి
మాన మిదంతయుఁ జూచి నవ్వుచున్
హారతులందు కొన్నది న
వారుణ గోళ గృహాంగణమ్ములన్.

ముందునకుఁ బోవు టే లక్ష్యముగ జనించి
ప్రకృతి తనలోనె పోటీలు పడుట యేమొ?
కాస్త ముందున్న తనపైకె కత్తి విసరు,
వెనుక వచ్చెడు తనపైనె విషము గ్రక్కు!

దారి ప్రక్కను గల బావిదగ్గ ఱెవరొ
బిందెలను దింపి, నను జూచి బిడియ పడిరి,
నగరు కంతకు, పసివారి నగవులకును
ప్రాణ మైనట్టి పాల వర్తకులొ వారు?

ఆవు నీటిని చాల త్రావిన దని చెప్పి
పసిబిడ్డకును నీళ్లపాలె పోయు,
చేను పండిన దేమి చేయుదు మని, మంటి
బెడ్డలు కలబోసి బియ్యమమ్ము,

కడు పథ్య మిది వెన్న కాఁచిన ఘృతమంచు
దుంపనేతిని కొంత తూఁచి యిచ్చు,
నిమ్మకాయలు సుద్ద నీటఁ బిండుటనైన
మజ్జిగ కానీకి మాసెఁ దోసఁగు,
బెల్లమున నల్లమన్ను, కాఫీ పొడుమున
చింతగింజల దూళిని జేర్చితూఁచు
ఈ విధమ్మునఁ దనకుఁ దానే విషమ్ము
నంజుకొని గింజకొనును మానవుఁడు తల్లి!

దిక్కులేక దారి దిగనాడఁ బడినట్టి
మృతకళేబరాల గతిని జనులు
ఆరుబైట నక్కడక్కడఁ బడియుండి
రుండ నిల్లుఁ గట్ట నుడుపు లేక.

దాలి పొక్కిలిపై చిన్న దాక నుంచి
నూక లేరుచు నున్నదో చీకు బడుఁగు
చెట్టుకొమ్మకు పైబట్ట నుట్టి గట్టి
బిడ్డ నూఁగించు చున్నదో బిచ్చగత్తె.

ప్రక్క చేలలో వేఁటాడి పాముకండు
పుట్టఁజేరుచు బండిపై బుస్సుమనియె,
లాకు చేరువఁగల మైలురాయి మీఁదఁ
కుదురుగాఁ బిల్లి యొక్కటి కొలువు తీరె.

త్రోవలో గంగబొండాల తోఁటలోన
ధాటిగా నేదో బలిగుడి యూట సాఁగె;
నిద్ర నాఁపుటకై ప్రయాణికుఁ డొకండు
చుట్ట ముట్టించె, సిగరెట్టు పట్టె నొకఁడు.

దిగుచుండి రెక్కుచుండిరి
పొగవాసన గొట్టుకొంచు పురుషులు స్త్రీలున్,
తెగ దీ బండికి పైనము,
సగమైతిని నేనుకూడ చము రుడివోవన్.

ముట్టించి బీడి నొక్కటి,
తొట్టికి పెన్నాని యతఁడు తొలును, బోల్తా
కొట్టించునో ? దేనికి ఢీ
కొట్టించునో ? యవధిఁ జేరుకో నిశ్చమునో ?

గుఱ్ఱమందురో ? ఇట్టి గుఱ్ఱాలు ఇండియా
  మొత్తాన లేవు మీ చిత్త మనుచు,
కాంగ్రెసు మజ్జిగ, కమ్యూని ష్టంబలి
  ఏది మ్రింగిన నొక్కటే నటంచు,
అమెరికా యేల? రష్యాయేల? మన మంత
  కంటె తక్కువ తింటిమా యటంచు,
హెచ్చి బాంబుల కంటె హెచ్చు సత్తువ యెంతో
  గాంధి సూత్రాల కే కలదటంచు,

గ్రామ—రాష్ట్ర—దేశ—విదేశ రాజకీయ
రీతి రాహస్యములను దర్శించు కొంచు,
మొండి కొరడాను ఝళిపించి మోర సాఁచి
బండి తోలుచు నున్నాఁడు బండివాఁడు.

రేవునుండి పై రేవునకుఁ బోవుచున్న
బండి యది, లేవు దానికి పగలు, రాత్రి;
గుఱ్ఱ మలసెను, బెసికెను గూఁడటన్న
తలఁపులే దాతనికి సమస్తము కిరాయి!

---

# దీపసభ

## హాఱికెను లైటు

ఎక్కడో పుట్టి, యక్కడి కేఁగుదెంచి
పల్లెపల్లెను, ప్రతియింటి బ్రతుకులోన
చోటు పొందిన హాఱికెను లైటొకండు
నాకుఁ దనువుగా—నేను జన్మంబుఁ గొంటి.

అదొక మామూలు రైతు గృహమ్ము, యిటుక
గోడలకు వెల్ల, చిఱుపాలె గూండ్ల నొదిగి
లక్ష్మి పటమును గలవు; మూలఁగల గాదె
గణపతి హుమాయి నెలవులు గడుపు చుండె!

పంచలో బండి, నాగళ్లు, పాడిగొడ్లు,
నడవలో డొక్కనార మంచములు, నటక
పైని కొబ్బరికాయ, లప్పడపు దినుసు,
సిరికి పుట్టిల్లు రైతు సోదఱుని యిల్లు!

కొట్టవచ్చెడి కుటిలంపుఁ గురులఁ బట్టి
ముడువకుండగ గాలికి విడిచిపెట్టి,
మోముపై నవి యళులట్లు ముసురుకొనఁగ
తోలుకొను, చొక్క చెలి నన్ను తోడు పిలిచె!

కూర కోసము మడినుండి కోసి తెచ్చి
తాత యొసఁగిన కాయలు తఱుగునామె,
కొంటెతన ముట్టిపడు నామె కంటి కొసలు
తీవి మప్పిన కత్తి గుండెలకె మెఱుఁగు!

మూఁడు రైటుల నొక నిప్పుపుల్ల తోన
కోరి వెల్గించి నాఁడొక్క కుఱ్ఱవాఁడు
మూఁడు పుల్లలు గీచియు ముసలి తాత
చుట్ట ముట్టించుకోలేక తిట్టుకొనును.

కిఱ్ఱు చెప్పులు, పొగచుట్ట కేలికఱ్ఱ
తుండు తలపాగ తెన్గు రైతునకు నిండు,
క్షేత్ర లక్ష్మికి విడిది వాకిలి మొగాన
పెండ్లి గొడుగును బట్టు పెత్తండ్రి యతఁడు.

మెరక పొలమునుండి, మెట్టపనుల నుండి,
సరుకు బేర మిచ్చు సంతనుండి,
వచ్చి, గంజిత్రాగి, వడిఁ బోవుచుందురు
కలుగ దింత విరతి కర్షకులకు!

ఒకరైటు పేట కేఁగెను,
ఒకరైటల తోఁట కేఁగె, నొక టావుల దొ
డ్డికి పోయె, నేన యిల్లం
తకుఁ బెత్తనమున్ వహించినా నంతటితో.

ఒకసారి వంటయింటికి పిల్చి పనిపెట్టు,
ఒకసారి వాకిటి కురుక నెట్టు,
ఒకసారి తేపతేపకు వీధిలోఁ ద్రిప్పు,
ఒకసారి గడపపై నుండఁ జెప్పు,
ఒకసారి తేలని యొకమూల (గొంపోవు
ఒకసారి చాలని యుంచిపోవు,
ఒకసారి నగారి వంచకుఁ దెచ్చి పోకార్చు,
ఒకసారి గోలెలో నోలలార్చు,
ఈ విధాన కృషీవలు నింటి దీప
మై యవతరించి, లెక్కలేనన్ని పనుల
నొక్కకంటనె కనిపెట్టుచున్న నన్ను
నిమిషమైనను నొకచోట నిలువ నీరు.

అందరు నేదో తోఁచిన
చందంపుఁ బనుల్ తెమల్చు, చటు—నిటు నన్ ర
మ్మందురు, పొమ్మందురు, బల్
తొందర పెట్టుదురు, ఏమి తోఁచఁగ నీరున్!

అందుఁ బర్వులిడుచు, నిందేదొ వెదకుచు
ఏదొ చూచి, యేదొ యేమొ చేసి,
చాల యలసి, యంత శ్రమయును సంసార
మునకుఁ దప్పదంచు మూల్గుకొంద్రు.

ఫలితమ్ము కన్న కష్టము
పలు విధములఁ బెద్ద, ఒక్క బ్రతుకుటకొఱకై
పలుచాఖ్ఖల కోరల సం
దులఁ జొత్తురు, మొత్తుకొంద్రు దుర్విధి యంచున్.

ఇంట నెందరున్న, నెన్ని వస్తువు లున్న,
నేను లేక పనులు లేనెలేవు ;
ఐన—నింటికెల్ల నే నన్నలోఁకువ,
పిల్లకంటికేని నల్లగలువ !

ఎల్లరును నాతో సేవ చేయించుకొనుచు,
కొంచెమైనను నన్ను గుర్తించ రార !
తిండియొక్కటి, దాని సాధించు టొకటి,
రెండె ప్రశ్నలు నరునకు రేయి, బవలు.

నలుగురు రైతు లేదొ మఱు
నాఁటిని గూరిచి ముచ్చటించుచున్
మెలమెలవచ్చి, వాకిటను
నిల్చి, సరే యిఁక రేపు ప్రొద్దుటన్
కలియుద మంచుఁబోవ, తమ
కమ్మున బిడ్డలఁ జూచుకొంచు లోఁ
గిలి కరుడెంచె గేస్తు, యిరు
కేలను ముంజెలు మోహరిల్లఁగా.

అన్నకంటె ముందు నాన్న చేతఁగలట్టి
వన్నికూడ తానె యందుకొనఁగ
పరుగుతీసి చిట్టిపాప బోకారెను,
అమ్మ లేవనెత్తి యయ్యకిచ్చె.

పాప నోదార్చు చాతఁడు పాగలోని
పెరుఁగు మామిడి పండును పిండిపెట్టి,
పేచి పెట్టు కుఱ్ఱకు జీడిపిక్క లిచ్చి,
పొలము విషయాల నెయ్యవో తెలుపుచుండ:

లేఁత ముంజెలు విడఁదీసి తాత కిచ్చి,
అమ్మకోసము చక్కని వట్టిపెట్టి,
పాప కసలేమి లేవంచు పాడు కొంచు
ముదురు కనులను బాలుఁడు చిదుప సాఁగె !

పెంకి పిల్లలంచు ఫిర్యాదు చేసెడి
వెలఁది మాట వినియు వినక నతఁడు
వేడి నీళ్ల స్నానమాడి, కొట్టమ్మున
కరిగి, పశుల మేఁత నరసి, వచ్చి:

తండ్రి, తమ్ముఁడు, చెల్లెలు, తక్కుఁగల్గు
వారు భుజియించిరో లేదొ పైన నడిగి,
బిడ్డలం బిల్చి, ముక్కాలి పీఁటమీఁది
కంచముం జేరి, భార్య వడ్డింపుచుండ:

గోమాత చేఁపినదియున్,
భూమాత ఫలించినదియు, పుత్రీపుత్ర
శ్రీమాత వండినదియున్
శ్రీమంతుఁడు రైతు ముద్దచేసి భుజించెన్!

పవలు పవలెల్ల చెమటోడ్చి పడిన శ్రమకు
లభ్యమైనట్టి పూర్ణ ఫలమ్ము గ్రోలు
సమయమున మానవుని యాననమును జూతు
మేని, నీ దివ్యకాంతి కాన్పించు నందు!

పాటుపడకుండ తిండి లభ్యమ్ము కాని
ప్రకృతి యొక్కటి నరున కేర్పడిన కతన
శ్రమము తప్పదు, కాని యాశ్రమను దొంగి
లించు "పనిదొంగ" నుండి రక్షింపు మతని.

అవని శ్రమచౌర్య, మాస్తిచౌర్యమ్ము, భావ
చౌర్యమును నేఁడు పీడించు చాల ప్రజల,
ఏ యనుభవమ్ము నుత్పత్తి చేయలేని
సోమరుల నుండి లోకము నోము మమ్మ!

తిండి ముగియించి, తృప్తితో త్రేఁచి, యతఁడు
కంచమందునె చేతిని కడిగివైచి,
తుండుఁగొని లేచి లేచుటతోనె, తెలిసె
రాశి దొంగలు దోఁచినా రన్న కబురు!

వెంటనె నన్నుం గొని యతఁ
డొంటరిగా బైలుదేరి యూఁపున బోవన్
కంటకములె వైదొలఁగెన్ !
తుంటరి పుర్వులును తెలిసి త్రోవ యొసంగెన్ !

పిడుగువంటి వార్త యడిచిన తనయష్టి
నీరు గారుచుండ నేఁగు రైతు
ఉక్కుపాదములకు మ్రొక్కెను సరిహద్దు
కంచెలెల్ల, నడ్డుగట్టు లెల్ల !

పాలె మంతకు నీవార్త ప్రాఁకిపోయి
కస్సుమని. లేచె రైతు లోకమ్మునందు,
కుఱ్ఱకారంత తలకొక్క కఱ్ఱబట్టి
పర్వులెత్తి రాతనికి తోడ్పడుట కొఱకు.

పేట పొలిమేర నొకమావి తోఁటలోన
కమల కిరవైన రైతు మకాము కలదు,
నాఁడె శిస్తుకై దింపిన నారికేళ
రాశి తరిగియుండిన దాఁప్రక్క కొంత.

అతఁడు చుట్టుతిరిగి, యానవాళ్లను చూచి,
వొందకాయ చూరవోయె నంచు
పెదవి చప్పరించి, పెద్దగ నిట్టూర్చి,
కొయ్య దుంగపైని కూరుచుండె !

తోడునచ్చిన పేటరైతులు వచించు
సానుభూతికి తా కృతజ్ఞతను చెప్పి,
ఒక్కరొకరుగ వారెల్ల చక్కఁబోవ
రైతు చూచును మరిమరి రాశి కేసి!

రాశిప్రక్కనె యున్నది రమ్యమైన
పూల, పిందెలదానిమ్మ మొక్కయొకటి,
రైతుచూపులు దానిపై ప్రాలినంత
స్వేదమును, కంపమును పట్టి పిడిచె నతని.

చివ్వున లేచి యతండా
పువ్వుల మొక్కకడ కేఁగి భోరున నేడ్చెన్,
ఎవ్వఁడొ రక్కసుఁడా లే
జవ్వనపుం గొమ్మవిఱిచి చనిన కతానన్.

పిందెలును, పూలు చిందరవందరై, మ
లీమసమ్మున బడియుండె; లేఁత బ్రతుకె
ముక్కలై యేడ్చుకొనుచుండె మొక్క మొదలు,
దుఃఖ పడుచుండె తోఁట రైతును దలంచి.

గాలివానల కేనియుఁ గలఁగనన్న
ఖ్యాతినొందిన నేనె దుఃఖమునఁ దూలి
పోతి, ప్రకృతి మానవులట్లు పొగులుచుండ,
జాలి నన్నేఁచె తీవ్ర వాతూల మట్లు.

తులువ యొకండు తోఁడి సరు
 నోఁచుక పర్వుడ, దారి కడ్డమై
నిలిచిన రక్తబీజ మిటు
 నేలకుఁ ద్రెళ్లుట సృష్టి పాలనా
కలనకు సిగ్గుచేటు, చిర
 కాలముగా వికృతమ్ము లిట్టివే
కలుగుట హేతు వీ జగము
 కంఠము కాలము గాల మాటకున్ !

కత్తిఁగాని వేయి కుత్తుక లుత్తరించు
రక్కసున కిందు నందు స్వర్గమ్ము కలదు,
ప్రతిమెతుకు కోసమును కష్టపడు కృషీశ్వ
రునకు హాలాహలమ్ము మ్రింగునది యెల్ల.

ఇంత కశ్మలముం గ్రోలి, యేమెఱుంగ
నట్లు ముసుఁగిడి జోగు చున్నది నిశీథి,
పరిమళించుచు నున్నదా ప్రక్కనేదొ
మూలఁగూర్చుండి సంపంగిమొగ్గ యొండు !

సుమలతలన్ సృజించెదు, ప్ర
 సూనములన్ సుమియించె, దే కురం
గమొ తినిపోవు, నే విసురు
 గాడ్పొ మహీస్థలి రాల్చిపోవు, నం

దములు రచించి జీవ మిడు
        దానవు, నీ కనుదోయి ముందఱ
లమున నశించి పోవ నెటు
        లం గనుఁగొంచు భరించుచుంటివో!

అఖిలలోకమాత, వాత్మజమా లోక
మెంత చక్కదిద్ది యేల వలయు!
పొట్టకోస మెల్ల భూతమ్ము లొకదాని
నొకటి మ్రింగు కొనుట నోర్తు వెట్లు?

కన్ను చెమ్మగిలదు కష్టార్జితమెపోవ,
మొక్కపోవ నదయె మొక్కవోదె!
జాలి నీకు నేర్పఁజాలును వ్యవసాయి,
అతనికున్న గుండె నవని కిమ్ము!

తోఁట కట్టవలును, దారి దొంకలెల్ల
వెదకి నిస్పృహాతో తమ వీడు చేరి
నారు తదితరు, లాతఁడు నందె యూఁగి
కాచుకొన సాఁగె తన కాయకష్ట ఫలము.

ఎండుగడ్డి తెచ్చి, మెత్తగ నమరించి,
అదియె పఱుపు కాఁగ నతఁడు పండె;
పొంతనుండి నేను పొలమెల్లఁ జూచుచు
కొంతసేపు మిణేఁకి కునికినాను.

# దీపసభ



## ఉల్క—

భూమికిని నాకు సంబంధ మున్న దన్న
దృష్టియే లేని గొప్ప గర్విష్ఠి నేను,
దివ్యదాకాశ వీథులఁ దిరుగుచుండి
క్రింది కెన్నఁడు చూడ నేర్చినది లేదు.

భవ్యతర నవగ్రహ కుటుంబ ప్రాఁదాన
నుద్భవించిన నవ్య నీలోత్పలముగ,
తారకా వంశ వృక్షాగ్ర తలమునందు
కన్ను తెరచిన పసరుమొగ్గగ వసింతు!

భూమికిం జూడగా, నేదొ భూత మట్టు
లంధకారము నాకు భయమ్ము గొల్పు;
కాన—పైచూపుతోన నే కదలిపోదు
గాలిమేడలు కలలందె కట్టుకొంచు.

చూపు తారాగ్రహాలను జొక్కుచుండ
అడుగులం బడుచుండు నే బడుగు రాలొ!
దారిప్రక్క పేదల జమీందారు వోలె
ఈసునం ద్రోచుకొంచు నే నేఁగుచుందు.

నేల విడిచిన సామెంత కాల మిట్లు
సాఁగెనో గుర్తులేదు, నా చరణములకు
తగిలి పడునవి రాలో, పేదల కళేబ
రాలో తెలియకుండఁగనే యుగాలు గడిచె !

తుదకెదో గ్రుచ్చుకొన్నది యెదకు, నిశిత
కంటకము కాలికిం బలె, కరుణారవము !
కలలపొరల గ్రుధారలఁ గరఁగిపోవ
వాస్తవము కేసి చూపును వంచినాను.

వెలుఁగు కంటను బెట్టుక వెదకి, జగతి
లోఁతులోఁతున గనుగొంటి, మాత ! నేను,
తునిఁగిపోయిన మొగ్గలు, తూంట్లుపడిన
యెదలు, పచ్చిగ విచ్చిపోయిన బ్రతుకులు.

లోక మొక సౌధ, మదియెంతొ శ్రీకరముగ
కనఁబడును దూరమునకు చీకటులమునిఁగి,
కరుణ కంటి సోదన దివ్వె బఱపి చూడ
నగ్నముగ తోఁచు దాని పునాది గాథ !

అడుసుత్రొక్కిన కార్మికుఁడు విశ్రమించినాఁ
డడుసు గుంటగనున్న గుడిసె లోన,
ఇటుక తీసినవాఁడు నిటుకయె తలగడ
గా తోఁటగట్టున కన్నుమూసె,

నున్నమందిచ్చిన చిన్నది సున్నానె
పఱచుకొన్నది తనపైఁట చెఱఁగు,
కట్టకోసిన అంపకారియు కడుపులో
కాళ్లుపెట్టుక పండె కట్ట లడితి,
అట్టి రత్నాలమేడను గట్టినట్టి
శిల్పి పొరిగింటి పంచకుఁ జేయి సాఁచె,
మానవులఁగూడి మనలేని ప్రాణి యొకఁడు
దాన శాసించు సెత్తులు పూని నట్లు.

సిరి వాల్జాపు, సరస్వతీ ప్రియ దర
స్మేరమ్ము, శైలాత్మ జా
వర సత్త్వమ్ము సమస్త జీవులకు ల
భ్యంబై ప్రకాశింప ; తత్
కిరణవ్రాతము కడ్డుగా నిలిచి, కాం
తిన్ గ్రోలి, క్రీనీడ పెం
దెరలో తక్కు జగమ్ము మాటువడ, నిం
గిన్ మేడ క్రీడించెడున్ !

నీడ నేమున్నదో యని మేడ నుండి
తొలఁగి ప్రక్కకు, లోనికి తొంగి చూచి,
గుండె కరఁగించు దృశ్యాలు గోచరింప
పాఱఁజూచితి గౌతమీ తీరమెల్ల.

విశ్వమందుండి పృథివికి, పృథివిలోన
భారతావని, కందొక్క భద్రవాహి
నీ తటమ్ముకు దృష్టి కేంద్రీకరించి
ప్రకృతి సౌందర్య వైవిధ్యము కనుఁగొంటి.

పరవశము చేయు సుందర ప్రకృతి మధ్య
నెదొ కురేఖ, వర్ణభ్రంశ మెదొ శమించు!
ఎదొ యపశ్రుతి, గాద్గద్య మెదొ రవించు!
ఎదొ యధర్మము, దౌర్భాగ్య మెదొ శపించు!

కళ్లమున రాశి దాపున కడియమందు
వెల్లకిలఁబండి, యాకాశ వీధిలోన
చుక్కలను లెక్కపెట్టెడి బక్కరైతు
చూపులో తోఁక నాడించు చోరభీతి!

శ్రీరామ భజన కోసము
చూరున గల చిఱతఁ దీయు సుభగుని చేతిన్
హోరెత్తఁ బొడుచు తే, లట
నారింజల దొంగ కింత నాటదు ముల్లున్!

రమ్యమై హాయినిడు వేణురవము నొరసి
చక్ర ఘోష మదేదొ రాజ్యమ్ము నేయు,
విమల చందన పారిమళ్యముల విఱచి
కాల్చి వైచును బ్రతు కేదొ కాటి కంపు!

బీరపాదులు ప్రాఁకిన నారికేళ
వృక్షములు ప్రేమగాథల వెల్లడింప,
తల్లడిల్లెడు నొంటరితనము గుండె
గ్రుచ్చుకొని తోఁట గుడిసెలో కొమ్మ యొకతె!

గుండె మాత్రము గుడిసెలో కొట్టుకొనుచు
సఖుని కోసము పరువెత్తు స్వాంత మెందొ!
అక్రమ మ్మేదొ శంకించు నంతరాత్మ
తలఁపు లొక్కొక్క టొక్కొక్క దారిఁ బోవు!

అందొక్క తలఁపు నది గ
ట్టుందుకొని సరాసరిం బ్రయాణము చేయున్,
మందలతో లంకల, లా
మందులతో డొంకలం గ్రమమ్మున గనుచున్.

దీవి పనినుండి కూలీలు రేవుఁ జేరి
పడవ నెక్కిరి నదిమీఁద పల్లె వైపు
పుచ్చకాయలు, చెఱకులు, ముంజె, లింక
నేవొ యున్నవి నావలో నిండ్లకొఱకు.

పడవ మెడ్డుచు నొక్కతె పాట పాడు
తెడ్డు వేయుచు నొక్కతె తేలి తూలు,
ఛెల్లుమని మీఁద నప్పులు చిమ్ముచున్న
నదికి మ్రొక్కను భీతిల్లి నాతి యొకతె.

రేవు విడిచి జీవి రేవును జేరుట
చచ్చి పుట్టుటౌను జగతి లోన,
వారిలోని నావ వశము తప్పిన దప్పు,
తిమిర మందు రేవు తెలియ కుండు.

అందముగా, నెచ్చెలు లా
నందముగా నావ లెక్కి నదిగొందుల బల్
చందమ్ముల విహరింతురు,
డెందమ్ములు పొంగి యలల ఢీకొందురునున్.

ఆవలి నావకై యీవల నిలుచుండి
త్వరపడు చున్నాఁడు తాత యొకఁడు,
ఏలను తడవంచు నేటిలోఁ బడి యీఁదు
కొని పోవుచున్నాఁడు కుఱ్ఱఁ డొకఁడు,
పడ వెక్కి బ్రతుకు లేముడు లెల్లమఱచి, గొం
తుక నెత్తినాఁడు భావుకుఁ డొకండు,
వేఁట దోనియ లోనె మూటకూడు ముగించి
వల పన్ను చున్నాఁడు వరుఁ డొకఁడు,
బ్రతుకు బండారమును విప్పి, బాహాటముగ
లెక్క చూచుచు నున్నదా లీల రేయి!
పని తెలిసి, చేయ నేర్చిన ప్రాణి కెందు
గట్టు లేదు, నిరోధించు గుట్టు లేదు.

ప్రేమ పాల్వెల్లి గోదావరీ మతల్లి
రత్నగర్భయు, రత్నాకరమ్ము నౌను,
కానిచో, మింటి యద్దాన గలుగు చెట్లు
ఉడుల పేరిటి ప్రతిఫలనోత్కరమ్ము?

అందోకతావు నుండి విన
    నయ్యెను మోహన గాన మేదొ, మా
కందపు నీడలం దెదిరొ
    కన్మొఱఁగెన్, పగయేదొ యేటిలో
గొందిని గొంతునుల్మి పడఁ
    గొట్టిన దేరినో, తాటిచెట్ల రా
బందులు తొంగిచూచెడును
    బందులు విచ్చిన నెత్తుకళ్లతో !

మృత్యు శయ్యను బడియున్న వృద్ధు నొకని
మనుప వైద్యుండు చింతామణిని గ్రహించె,
బ్రతుకు బాటలఁ బరువెత్తు బాలు నొకని
త్రుంప దైత్యుండు నట్టేటఁ ద్రోచి వైచె!

తోడి నరు వేడివేడి నెత్తురును జుట్టి
పెద్దపులి వేషమున తాండవించు నరుని
గాంచి, తనగుండె బండిచక్రమ్ము గాఁగ
ప్రక్కప్రక్కల కొదుగును ప్రకృతి మాత !

ప్రణయ శీలుఁడు కాంతికి రాజనంగ
హంతకుఁడు ధ్వాంతమున కెల్ల రాజరాజు,
కుసుమ వనమును, వనపాలకుఁడును కూడ
గొడ్డలికి కేలుమోడ్తురు కువలయమున!

తమకుఁ గానట్లు పంచభూతములు నపుడు
దేని పని మీఁద నదె పోవుఁగాని తల్లి!
ఆ యమానుష కృత్యమ్ము నాఁపలేవు,
నిరసనమ్మైన ప్రకటింప నేర వౌర!

ఇంత ఘోరము తమ కండ్ల యెదుట జరిగి
పాప పంకిలమై నేల పాడువాఱ
మిడుతు మిడుతున జూచుచు మిన్ను నుండి
ఊడి పడవయ్యె నేలనో ఉడుగణాలు!

కాంత కావచ్చు, కావచ్చు కాంచనమ్ము,
కారణమ్మేది యైనను గాని, జగతి
బ్రతుకుటయె ధర్మమై పుట్టి బ్రతుకునట్టి
మానవుని జంపనేలను మానవుండు?

గౌతముఁడు బుద్ధుఁడయొ, ఏసు క్రీస్తువయ్యో,
అందరిని మించి గాంధి మహాత్ముఁడయ్యో,
ఎవ్వ రేమైన గాని, యీ యిలను నరుని
రక్త దాహము నార్పలేరైరి, తల్లి!

ఎట్టిదైనది నది యెల్ల, నెట్టి నయ్యె
సృష్టియెల్లను, గుడిసెలో చెల్వ యేమి
టయ్యె నన్న తలంపు నా యాత్మఁజొచ్చి
తొంగి చూచితి నే, నంత తొట్రుపడితి.

కమలాప్తుఁడు గ్రుంకిన దివ
సము వలె, తారకయె లేని శర్వరి వలె, దీ
పము నారిన సదనము వలె
సుమకోమలి తనువు వాడి శూన్యం బయ్యెన్.

చెంతనే గల మామిడిచెట్టు మీఁద
నిదురలో నున్న గోరింక యదరిపడియె,
పరిసర ధరారుహాగ్ర కోటరము నందు
ఘూక మొక్కటి భీతితో క్రేకరించె.

ఆ మటునన్ హఠాత్తుగ భ
యంకర దైత్యుఁ డెవండొ యొక్కఁడా
కోమలి డాసి, తోన దన
క్రూర నఖమ్ములఁ గ్రుచ్చి యెత్తి, యే
పామునొ ముట్టినట్లు పడ
వైచి, గృహమ్మునకు నిప్పు పెట్టె; ఆ
రామము గోడు గోడు మన,
రాత్రియు గొల్లున గోలపెట్టఁగా!

కని యీ ఘోరము పోవని
కను లయ్యవి కనులు కావు కంకటి రాలే,
ననుకొంచు, భగ్నమని నే
నును నేలకు రాలిపోతి నుగ్గై, ముగ్గై!

స్వార్థపరుని దురాశ యాశలను మూసి
ప్రగతి నరికట్టి యంధకారమునఁ ద్రోచె,
తరుణ హృదయాల స్వప్న సౌధాలుకూల్చి
నవ్య నవ్యానుభూతి ననాథఁ జేసె.

కడలు చీల్చుక విచ్చిన కరుణ రవము
గుండెలో రాజుకొని మన్కి మండి పోవ
ఆ జలాగ్ని సమాధుల యందు వ్రాలి
ద్వైతమై నేను వారి కద్వైత మైతి.

# దీపసభ



## కొబ్బరితుంట

జట్టుగాఁ బోవు కూలీలు గట్టు ప్రక్క-
రాలి పడియున్న యొక కొబ్బరాకు లాగి,
తుంటగాఁ గట్టి నన్నింత తోడుపిలువ,
రాణి నైతిని నే నంత రాత్రి కెల్ల !

ప్రొద్దునకు ముందె మేల్కొని, పొలము వోయి,
పనులు వీడరు ప్రొద్దుపోయిననె గాని,
కార్మికుల కాయ కష్టమే కాని, వారి
రాకపోకలు గను వీలు రవికి లేదు.

ఆ దరిద్రుల బ్రతుకుతో నంధకార
మడుగు సాఁగించు నెదో పందె మిడిన రీతి,
వెలుఁగు పుట్టగనే చుట్టు వెల్లివిరిసి
పోరు సాఁగించు నది మాసిపోవు దాఁక !

గాలివానల లోన గసియాడి మనుగడ
తెరువుఁ దప్పిన మల్లెతీగ వోలె,
కష్టాల కాలి పోకడలలోఁ బడి నల్గి
పోయిన చిఱుగడ్డి పూవు వోలె

పొగమంచు సెగలోన పువ్వారములు రాలి
కగ్గిపోయిన మావి మొగ్గవోలె,
మండు వేసవి లోన నెండమావుల వెంట
తగ్గక పరువెత్తు దప్పి వోలె,
కష్టమే గాని సుఖ మెరుంగని కరాన
ముగుద యొక్క_తె నను గోని ముందు నడువ
వెనుక వచ్చెశి వారిలో వెల్లివిరిసె
రమ్య గేయ స్వరూప సారస్వతమ్ము.

నిష్కారణముగ కిన్నెర వంటి కోడండ్ర
నీరుచేసిన యత్తగారి కథలు,
మండు మ్రాకుల మాయ మంత్రమ్ములకునైన
కలఁగని బాలనాగమ్మ కథలు
కోటి సైన్యము నైన గోట మీటఁగఁ జాలు
బొబ్బిలి సాముబెబ్బులుల కథలు,
కలవారిఁ గొట్టి పేదలకుఁ బెట్టెడి మేటి
జెట్టి చిన్నపురెడ్డి జట్టు కథలు,
వెన్ను జూపని పల్నాటి వీర కథలు,
కల్ల లోర్వని గోసంగి, గొల్ల కథలు,
శ్రామికులు పాడుకొంచును సాఁగిపోవ
క్షితితల మ్మెల్ల సావధానత వహించె!

పరవశ మంది శ్రామికులు
　　పాత యుగాల కథావశేషముల్
నిరతిగ పాడుకొంచు, రజ
　　నీ హృదయమ్మును జొచ్చిపోవు ము
మ్మరమున, ఘూకకాంతలు త
　　మావగ వారల వెంటఁ బోవుచున్,
చోరవగఁ దామెటింగిన వి
　　నూత్న చరిత్రము లాలపించెదున్.

కూయ నేర్చినట్టి గుడ్లగూబల నోట
పాడ వలసినట్టి పాట పుట్టె!
వారి యమృతగాన వర్షమ్ములో రాళ్లె
చివురు లెత్తు, ప్రోళ్లఁ జెప్ప నేల?

జలపూరమగా నూడుపుల చేలలో, స్వేద
　　జలపూరమై మేను జలదరింప;
శ్యామల సస్య పుష్కలమగా పొలమ్ముల
　　శ్యామలా ప్రేమగేయములు వెలయ;
ప్రాణంపుఁ బ్రాణమగా పాలయెన్నుల ప్రోల
　　ప్రాణమ్ము హాయిగాఁ బరవశిల్ల
భద్రకాళీ కుచాభమగా మహా ధాన్య
　　రాశికి కన్ను భద్రత నమర్ప;

కృషి పదాలకు బ్రతుకు సంకితము మొనర్చి
చెలఁగి నిర్లిప్తుఁడై యాత్రఁ జేయునట్టి
కూలి బిడ్డను గీర్తించు గొంతు విప్పి
ఆ శకుంత గాయన గాయనీ శతమ్ము!

క్షమ యను గూనతో బ్రతుకు
సారము బోదెల కెత్తి, కాయక
ష్టము నెటో సాగుచేసి, ఫల
సాయము తీసి, తదన్న మెల్ల దే
శమునకుఁ బెట్టి, తాను భృతి
చాలక పస్తుపరుండు కార్మికో
త్తమునికి మించి వేరె యొక
దైవము కల్గునె మానవావనిన్?

అన్నపూర్ణమ్మ సత్యమీ యమ్మ యనుచు,
ఇల ననాసక్త యోగ మీ వృద్ధుఁడనుచు,
బాలగౌరిని బోలు నీ ప్రమద యనుచు,
కూలివారిని కీర్తింత్రు ఘూక కవులు!

పైని కాయకో, పండుకో పైనమైన
వెన్న ముద్దల పేరిట వెలయు పక్షు
లాశలం బోవుచుండిన, వందు కొన్ని
మా సమీప వనమ్ముల మసలఁ జొచ్చె!

కేళిగ కొమ్మ కొమ్మకును
 గెంతుచు, కొబ్బరి లేఁత బొండముల్
గ్రోలుచు, జీడిపండ్లు తిని
 రొప్పుచు, కోయిల క్రొత్త గూండ్లపై
వ్రాలుచు, నిద్ర లేపుచు, వి
 వాదము లాడుచు నా నిశా విహం
గాళి వినోదముం గొలిపె
 నా మొలఁదోఁటల దీటు బాటలన్.

గోలగ చప్పటల్ చఱచి
 కొబ్బరి పుచ్చెలఁగొట్టు కుండఁగా
త్రోలిన వారి కేకలకుఁ
 దూలిన పక్షులు—మావి తోఁటలన్
వ్రాలఁగఁబోయి—వానిచివ
 రన్ గనిపెట్టుక యున్న రోటి డ
బ్బా లిడు బొబ్బలన్ బెదరి
 పర్విడు దృశ్యము నవ్వుఁ దెచ్చెడున్.

మామిడిచెట్లకున్ మధుర
 మౌ ఫలముల్ దయచేసి, వానికిన్
గోమలమౌ సువాసనలు
 గూర్చి, క్షుధార్తములైన పక్షు లా

శ్యామయ దృక్కులన్ బఱపు
చా దరిదాపుల కేఁగు వంతనే
ఈ మొనగాండ్ర నిట్లు నియ
మించిన దెవ్వరో రాళ్లు ఉవ్వఁగన్ !

క్రూరజంతు సంకు లారణ్య భూముల
చింత లేకనే వసింప వచ్చు,
నరులు గ్లువట్టి నగరాల నిత్యము
మృత్యు గహ్వరమున మెలఁగ వలయు.

అని సణుఁగు కొంచుఁ బోయెడి
మునిపక్షుల కేను శాంతముగ సృష్టిని గూ
ర్చిన యర్థము వాకొన బో
యిన తక్షణ మవియుఁ బోయె నెడనెడ దవ్వై.

నీడ గన్గొని భీతిల్లు నెలఁత మిన్న
లంధకారమె చీల్చుక యరుగుచుండి
తుంటకై కొబ్బరాకులు దూసికొంద్రు
ఎలుక బొండాలు గుజ్జుకై యేరు కొంద్రు.

మంచి పండిట పరిమళ మీను చున్నది
వెలుఁగిందు తెండను వెలఁది యొకతె,
చక్కని పండని చయ్యాన నిటుక పాం
తను దాఁకి పారవైచు తన్వి యొకతె,

తుంట వేడికి క్రింద దూఁకిన తొండను
        పండు రాలిన దంచుఁ బట్టు నొకతె,
చిలుక కొట్టొక పేదా చేతికి దొరకిన
        ఊరించి చీఁకు నొయ్యారి యొకతె,
క్రింది కొమ్మలలో పక్షి రెపరెప మన
ఉల్కిపడి కొమ్మపైఁ బడు నువిద యొకతె,
గ్రామికాంగన లిట్లు మార్గమున గల్గు
మావితోఁటను జొరఁబడి మసలినారు.

ఒత్తుగ రాలి ఫెల్లుమను
        చుండిన మామిడియాకు గుట్టలన్
చిత్తుగఁ ద్రొక్కుకొంచు, నెది
        చిక్కిన దాని నె నోటఁ గ్రుక్కుకొం,
చుత్తినె పండు పండనుచు
        నూరుచు, కొంచెముసేపు కూలి వా
రత్తరి నాఁగినారు దిన
        మంతటి కష్టము విస్మరించుచున్ !

ఇహ పరమ్ముల రెంటిని నెంతకైన
ధనము వెచ్చించి కొనఁగల ధనికుఁ డొకఁడు,
శ్రాంతి పైకొని కూర్చున్న శ్రామికలను
తోఁట తనదంచు వదలించి తోలి వైచె !

పిల్లేడ్చు నంచు నొక్కతెం
తల్లేడ్చు నటంచు నొకతె, తల్లడమున నా
యిల్లాండ్రు కదలి సాఁగిరి
పెల్లాఁకటి తోడ కూలిపేట మొగమ్మై !

ఆ దారి ప్రక్క నవు డొక
రోదన వినిపించె, నెదుట రోదసి మూకే
దో దుర్గభి త్రివతె దు
ర్భేదనమై నిల్చి, నిల్వఁ బెట్టిన దంతన్ !

ఆఁగి మేమంత, దిక్కుల నాలకించి,
కొంత సేపటి కొక కొంప గోచరింప
దాని దరిసితి ; మా కూలి చాన లదుర
బెదురు గుండెలతో లోన బెట్టి రడుగు !

తల్లియొ, తండ్రియొ, యెవరి
తల్లియొ, తండ్రియొ వచ్చి, ప్రేమ భా
సిల్లు ముఖాబ్జ మశ్రుజల
సిక్తముఁ జేసుక ముద్దు లాడుచున్
ఉల్లముఁ జేర్చుకొందు రని
హోరున నేడ్చెడి యొక్క బాలకున్
ఫుల్లసరోజ నేత్రలు క
నుంగొని రొంటరి పూరి పాకలో.

మిన్నేటి వెన్నెల తిన్నెలలో నాడు
 కొనుచుండి కాల్జారి కూలఁబడెనొ,
చంద్రవంకను దాఁగు సారంగమును బట్ట
 పర్వెత్తి యేడొంకఁ బట్టువడెనొ,
పారిజాతాగ్ర పుష్పముఁ గోయఁ జెట్టెక్కి
 ఏ భ్రమరికచేత నేఁచబడెను,
ముద్దుపుట్టఁగ నాకముగ్ధలు బిగిపంట
 చెక్కులు గట్టిగా నొక్కినారొ,
అమృత కిరణాల తూఁగుటుయ్యాల నెక్కి
బాల్య చాపల్యమున పోయి బాలభాను
కరదీపము ముట్టి కేల్గాల్చుకొనెనొ,
కేళి మని, మేల్కొనియు, బాలుఁ డూరకొనఁడు!

తన యున్న పాటు నెఱుఁగక,
తన నెవ్వరో వచ్చి, యెత్తి, తమకమ్మున లా
లనఁజేయఁ గోరు బిడ్డను
గను చందరు నొక్క చేతఁ గైకొని రతనిన్!

అంతవఱ కొక్క తల్లి కరాంబుజముల
ప్రియత మాత్ర మెఱింగిన బిడ్డ యతఁడు
ఒక్క బిగి నందరమ్మల యొడిని జేరి
గుక్కదిరుగక యుక్కిరి బిక్కి రయ్యె!

అంత నాబిడ్డఁడి నంది, యందొక్క
పాలు పొంగిన లేఁత బాలెంతరాలు
లల, లలా యంచు జోలను పాడుకొంచు
సందిటఁ దీసుక చన్నిచ్చి గుడిపె.

చంటి బిడ్డకు, పాలున్న చాన లెల్ల
తల్లులై యుండగా, సొంతతల్లి యేల!
తల్లి పాలిండ్లు జీవామృతమున నింపు
తల్లులకు తల్లి వీవుండఁ దక్కువేమి?

రేపు మిత్రుని లేఁపు రూపు కోసరము తా
మరపువ్వ చీరలు మార్చుకొనుట,
రేపు ప్రేయసుని కోరిక దీర్పఁగ గులాబి
మొగ్గ నచ్చిన రంగు పూసికొనుట,
రేపు పాంథుని తృష్ణఁ బాపఁగా నెమ్మోవి
కెమ్మోవి నమృతమ్ము కెఁలుకొనుట;
రేపు నూత్నాతిథి సేపున బోషింప,
కుచగుచ్ఛములు తేనె గూర్చుకొనుట,
చూచి, భావిలోనికి తొంగిచూచి,యణువు
నణువునన్ నీకు శయ్యాగృహమ్ములోనె
పురిటి మంచమునుం గల్గు టరసినాను,
నీవ ప్రేయసివి, ప్రజాత వీవ జగతి!

తన యిచ్ఛవచ్చి నట్లుగ
తన రూపము, తన గుణమ్ము, తన మార్గము, చే
తన మార్పుకొంచుఁ బోవుట
కనుఁగొంటిని, ప్రగతి నరయఁగంటిని, తల్లీ !

ఆ యనాథబాలు నారీతిఁ గైకొన్న
కార్మికాంగనల ముఖమ్ము లందు
నీ ముఖమ్ముఁ జూచి, నీ యునికిఁ గన్గొని,
శిరము వంచినాను చరణములకు !

యమునలో సూతునకుఁ గన్ననట్లు, కణ్వా
నకు మహాటవిలో శకుంతల విధాన
విమల కారుణ్యమే భారతముగఁ జేసి
మహి కొసంగిన నీకు నమస్కృతమ్ము !

చాల సేపాఁగి, యేతల్లి జాడలేక,
బాలు నొంటిగ దిగనాడ కాలురాక,
కూడఁ గొంపోవ సాఁగిరి, తోడనున్న
వృద్ధనాయకు మాటపై వెలఁదు లతని !

అంధకారము లోన నల్లాడు జీవికి
రాజదా యేకొబ్బరాకు నెఱసు ?
ఉదయ మాదిగ చెమ్మ టోడ్చిన దేహికి
వీచదా యే చల్లపిల్లగాలి ?

క్షుత్పిపాసలఁ జిక్కి శుష్కించు వ్యక్తికి
దొరకదా చేతికే దోరగాయ ?
నూత్నాను భూతులు నోచని ప్రాణికి
పిలువదా యే పాలపిట్ట కూఁత ?
కువలయాల చీకటుల వాగురల నుండి
శశిని పైపైకి తెచ్చిన శక్తియేదొ
ఏటి దరి తిల్లడొంకలు దాఁటి పోవు
కూలి జట్టును నడిపించె కేలుఁబట్టి !

తుంట పొగలేచి కేల్చాచి తోడితెచ్చు
ఇరులలో నొక్క బంగారు నెఱసువోలె,
ఇరుల వెన్నంటి కడలంటఁ దరిమికొట్టు
వెలుఁగులో నొక్క నీలంపు నలుసువోలె ;

వెలుతురు పోసికుండగ,
చెలువల చేతులను గల్లు చిఱుతనివై పు
ర్వాలు వాలనీయ కుండఁగ
మొలకువ నాశక్తి కలిసి మెలఁగెను మాతో !

పడఁతి యొక్కతె తందాన పాటపాడ,
నాతి యొక్కతె యుయ్యాల నడకనడువ,
నన్నుఁగని బిడ్డఁడెదొ బోసి నవ్వునవ్వ
పేటచేరిరి కూలీలు బాటచివర

పాడు గుంటకు క్షుద్ర వాటిక
త్రాడు గట్టిన కూలి పేటది,
పెంట కుప్పల మధ్య మిత్తికి
వంటసాల యది!

ఇరుకు సందు లటంచు దోమలె
ఈసడించెడు కళ్మలంబది,
ఇంటి కంబెను పెంట మేలని
పించు గూడె మది!

తేళ్లు, జెర్రెలు, కట్లపాములు,
కాళ్లలో కాట్లాడు డొంకది,
బాగుపడని మహా భయంకర
రోగముల పుట్టిల్లది!

శ్రీత జనాస్థులతో పిశాచులు
జతలుగా కోలాట మాడే
మరణ యాత్రా మార్గమం దే
ర్పఱచి నట్టి మకా మది!

పేట లోపల నేను పాదము
పెట్టినానో లేదొ, మృత్యువు
ఝుమ్ము మని శతకోట్లుగా మళ
కమ్ములై నా చుట్టు మూగెన్!

మఱికి సందుల, నిఱుగు గుడిసెల
మూల్గుచున్న దరిద్రమున్ గన
తగులఁబెట్టఁగ బుద్ధిపుట్టెను
తల్లి, నాకపుడు !

చింతన నెఱుంగు చేతనాచేతనముల
ఇంత లేమి భరించు వారెవరు లేరు ;
సృష్టికి కిరీటమనుకొన్న శిష్టుఁడేలొ
క్రుళ్లు బ్రతుకును తొలఁగించుకోఁడు తెలిసి !

చేతకాని నరుఁడు సిగ్గు నెగ్గును లేక
పాడు గుడిసెలందె బ్రతుకుఁ గాక,
చలము గల్గి, చేత బలమున్న చిచ్చేల
ఓగుఁగాల్చి, బాగు నోమ రాదు ?

మెఱపు వలె నీ తలంపెద
నొరసిన తక్షణము, చెంత నొదిగిన కొంపన్
కరమంది పుచ్చుకొని, భీ
కర రూపము దాల్చి, పేటఁ గాల్చితి నంతన్ !

గుడిసె చూఱును నే నంటుకొనెడు దాఁక
త్రోవ చూపించు నాకుల తుంటనేను,
అంతలో తుంట బ్రతుకంతమై, వినూత్న
ధర్మసృష్టికి నాయకత్వమ్ముఁ గొంటి !

# దీపసభ



## గుడి దీపము

అదియొక దేవతాయతన,
మం దొక నల్లని రాతి బొమ్మ చ
క్కఁదనపు టెక్కు డైన గిరి
కన్యకు మాఱుగ పూజ లందుచు
న్నది ; ధనమే ప్రపంచ మని న
మ్ముచు, దైవము పేర తానె య
భ్యుదయము నొందుచున్న యొక
పూజరి నన్ వెలిఁగించె సంధ్యలో.

నీ వఖండము నీ నుండి నే నఖండ
మేకధారగఁ బ్రవహింతు మెల్ల సృష్టి,
రూప సాదృశ్య మరయక రోజురోజు
నిన్నుఁ జూడఁగ మనుజుఁడు నన్నుఁ దెచ్చుఁ.

ఆరిపోవని విశ్వాస నాదమఱచి,
కన్ను మూసుక వెల్గించు వాలు చున్న
వత్తినె నరుండు ; నీ ప్రక్క కొత్తిగిల్లి
వెలుఁగు కోసము చేతులు వెలికి చాఁచు ।

ప్రమిదె నిల్చి, నీ పాదపద్మములు కొల్చు
భాగ్య మబ్బుట కానందపడుచున్నాను
వెల్గి, వెల్గించినా నందు మూల్గుచున్న
చిమ్మచీకటి జీవనాళమ్ము లంత.

మధుర మీనాక్షి, కంచి కామాక్షి వంటి
దేవతలఁ జూచి, తల్లి ! నే తెల్లఁబోతి ;
నిను ముఖాముఖిఁ జూడఁ జాలని నరుండు
చెక్కినాఁడు నిన్నాహారుఁ జిక్కినట్లు !

ఏ రూప మందుఁ జూచిన
నీ రూపమె గోచరించు నేదో యొక సం
స్కారమున, నీవ శిల్పము
తీరున వికసింప, వెల్గితిని సంతృప్తిన్.

రాతి బొమ్మల నుదుట నీ వ్రాలు కలదు
మహిత శిల్పమై, అదియె సన్మాన పత్ర
ముజ్జ్వలానంద రత జీవి కుర్వి లోన,
చదువుకొనువాఁడె నీచేత సత్కృతుండు.

భారత శిల్ప భారతికి
పట్టిన ఛత్రమువంటి గోపుర
ద్వారము నంటి, "ధన్యముగ
దా మన జీవిత" మంచు నెవ్వరో!

దూరము నుండి వచ్చిన వ
ధూ వరు లాలయ భిత్తికా పురా
చారు కళా విభూతి కవ
శమ్మున మ్రొక్కిరి, చొక్కి రాపయిన్ !

చక్కఁగా నిలువెత్తున చెక్కఁబడిన
త్రిపుర సుందరిఁ జూచి, మత్తిల్లి యతఁడు
చెక్కు చెదరని రొమ్మపై చేతు లుంచు,
మొక్కవోవని చెక్కిటఁ జెక్కుఁ జేర్చు !

తాండవముచేయు నటరాజు "తదిగిణత"కు
"దిగిణత" యటంచు నెడఁద స్పందించుచుండ
అతని కన్నులలోఁ జూచు చితర మెల్ల
మఱచి నిల్చున్న దం దే యా మగువ మిన్న !

కాలమును చేలమున గట్టి కదలకుండ
వీణ వాయించు చున్నదా విశ్వవాణి ;
శతశతాధికాబ్దము లామె చరణపద్మ
పీఠి కొక్కొక్క పత్ర మర్పించిపోవు !

అచట కాలము లేదు, బ్రహ్మకు వికార
ఖరముఖ మ్మల్లె నేదును కలదు నిలిచి ;
కదలలే దాదికూర్మ మొక్క యడుగైన,
మహిషమర్దని పరిహరింపదు కరాసి !

వీణియకు వాణి తొలిమేళ వించుకొన్న
రాగ మీనాఁడు నదె స్థాయిలో గమించు,
పుట్టి నప్పుడె శ్రీదేవి పట్టినట్టి
వరద హస్తపు ముద్రలో వార లేదు.

ఆఁగిపోయిన కాల మహా ప్రవాహ
కోమల సరోవరమ్ములఁ గ్రుంకు లిడుచు,
ఒండొరుల హత్తుకొని తడు లొత్తుకొనుచు,
ప్రేయసులు సాఁగి, యే నీడొ మాయమైరి !

కాలమును బట్టి మూటలు గట్టి యచట
నిల్చిపోయిన యా ముగ్ధ శిల్పి యెవరొ!
పొంగి ప్రవహించు సౌందర్య గంగలోన
సతఁడు గ్రోలిన తలమెల్ల నమృత సరసి!

అది కళానుభూతి, యది రసానందమ్ము,
అందుకొఱకె యాలయమ్ము కలదు ;
నిన్నుఁజూచి, తనకు నీవిచ్చు మాధురు
లాను టెవని బ్రతుకు కేని ఫలము.

ఒకప్రక్క తరుణు లా క్రియ
సకల కళారుచుల నిన్ను సందర్శింపన్,
ప్రకృతాత్ములు కొందరు మఱి
యొక ప్రక్కను జేరి, యడుగు చుండిరి వరముల్.

కొబ్బరి కాయలున్, బసుపు,
కుంకుమ, పువ్వులు, పండ్లు, నర్ధణా
డబ్బులు చేతఁ బుచ్చుకొని
డాగులు పడ్డ మనఃపటమ్ములన్
సబ్బున గుంజిపెట్టు మని
స్వామిని జేరిరి మానవాళి, పై
గబ్బుకు గబ్బిడమ్ములె గ
కావికలై గుడి వీడిపోవఁగా.

తన దొంగతనము పారిన, నొక్క టెంకాయ
కొట్టుదు నని మ్రొక్కుకొనియె నొకఁడు ;
వెలఁదికై హితునికి విషమిచ్చి, దొసఁగు నీ
పైఁటకుఁ దుడువగా వచ్చె నొకఁడు ;
రోజెల్ల దొంగ తరాజుతోఁ బ్రజ దోఁచి,
ముక్తికోసము కేలు మోడ్చె నొకఁడు ;
కూలీల నేడ్పించి, కోటికి పడగెత్తి,
అరణాకు కైవల్య మడుగు నొకఁడు ;
సంఘ జీవఘ్నమైన దుష్కార్య మెంతొ
చేసి గడియించుకొన్న యాశేష కిల్బి
షమును నీ కొక్క పువ్వు లంచముగ నొసఁగి
కడిగివేయించుకొన వచ్చె ఘనుఁ డొకండు !

లావుగలవారి కెల్ల పులావుఁ బెట్టి,
తిండి తినని డ్రైవరును గద్దించి లేపి,
జీపుకారున గూర్చుండి చేరె నంత
సహాచరులతోడ నొకస్వామి స్వామి గుడికి.

నర బలుల నిచ్చు కాలము నాశ మయ్యె
జంతు బలు లిచ్చు కాలము నంత మయ్యె
ఇటను దిని, యటఁ బ్రేన్నగా నెంచి నరులు
అంత రాత్మలు బలియిత్తు రమ్మ ! నేడు !

సిగరెట్ పొగాకు తెచ్చిన లాభ మరలకు
పంట్లాము జేబులో పదిలపఱచి,
పెండ్లికంటెను వేరు పెద్ద కోరిక లేని
పొరుగింటి పడతిని మోహపెట్టి,
కష్టించి పాప మే కవియొ సృష్టించిన
బంగారు కథ నొండు దొంగిలించి,
మాటలు, పాటలు మక్కికి మక్కిగా
నే ప్రాఁత ఫిల్మునో కాపి కొట్టి
ప్రముఖ మంత్రి యెవరో ప్రారంభ శుభ మహో
త్సవము చేసి తనను చాల పొగడ,
కోట్ల కొలఁది పచ్చనోట్లకై వర మేదొ
కోర వతఁడు నిన్ను జేరి నాఁడు !

అతఁడు తీసిన దొక పతివ్రత చరిత్ర,
నాయికా పాత్ర వాడ కంతకును వదిన !
ప్రజల దౌర్బల్యముల మీఁద భావి భాగ్య
సౌధములు కట్టుకొందురు స్వార్థపరులు !

అతఁడు నీకు మ్రొక్కె సమ
యమ్మున, నాతని నిన్నుఁ గూడ నే
కాతరతన్ బడే వదిగఁ
గాంచుచు నుంటిని ; వాని మోముపై
శీతల చంద్రికా సుభగ
చింతనముల్ వికసించు నంత—నీ
చేతన మోడువోయినది,
చీకటి క్రమ్మిన దెల్లదిక్కులన్ !

గణ గణ మను గుడి గంటల
రణనమ్మున నట్టహాస రవ మంత నెదో
వినిపించెను, కనిపించెను
గణనాథుని దంత కాంతి కణ మొక మూలన్.

మోజుగల తారతో, నా
రోజుకె రాజై రహించు ప్రొడ్యూసరు నీ
బూజు గుడికి వచ్చుటతో
పూజారుల పూర్వపుణ్యములు తెగఁబండెన్ !

నిను మఱచిన పూజారులు
నను మఱచిరి, భక్తుఁ డొసఁగు నానావిధ చం
దన తాంబూల ధనాదులఁ
గొను, చంతట మూసినారు గుడి గుమ్మమ్ముల్ !

నీ కళామూర్తితో గుండె నింపుకొన్న
ప్రేయసులతోడ నీ వెందుఁ బోయి నావొ,
ఒంటరిగ— చిన్నవోయిన మంటపమున
నేను గుడినట్టె కొడిగట్టి నిద్రపోతి !

---

# దీ ప స భ

## కొఱవి దయ్యము

పూర్వ వాసన లెట్టివో ప్రోత్సహింప
చేరినవి ప్రక్క ప్రక్క నస్థికలు రెండు,
వాని సాంగత్యమందు రూపము గడించి
భూతమై నిల్చితిని రుద్రభూమి నేను!

కారెము లాడుచున్, బశులఁ
గాపరు లెందో గిరాటువేసినన్
చేరికఁ గొన్న యెమ్ములకు
స్నేహము కల్పనచేతు నంచు నన్
దూరకుఁ డేరు; విశ్వ సృజ
నోద్యమ కార్య వర ప్రణాళికన్
గారణముల్ విశూన్యములు,
కల్గదు వానికి హేతువాదమే.

కలద యేని పరస్పరాకర్షణమ్ము—
ఎడఁదలకె కాదు, కలదది యెమ్ములకును,
మనుజులకె కాదు, కలదది ప్రమాఁకులకును,
మనుగడనె కాదు, కలదు సమాధిఁ గూడ!

కొన్ని దినమ్ము లైన దాక
  కోమలి నందు సమాధి చేసి, యే
మున్నదొ లోన ! ఏల నతఁ
  డొంటరిగా ప్రతి రేయి నీరధుల్
కన్నులఁ బట్టి తెచ్చి యటఁ
  గార్చెడు ! మొక్క-యి మొల్వ నేర్చునో !
క్రొన్నన లీయవచ్చునొ ! త
  రూన్నత శాఖలఁ బల్క-రించునో !

పోయి రూపము, జ్ఞానము పోయి, వంతు
వంతునన్ పంచభూతాల నంతరించి,
ఎట్లు వినఁగల దాతని యేడ్పు నింతి ?
కరఁగి ప్రవహించు కన్నీరుగా నతండు !

అతఁడు బడిలోన "భాస్వర" మనుచు నన్ను
ముట్టుకొని చేయి కాల్చుకొన్నట్టి వాఁడె,
పూర్వ పరిచయముంబట్టి పోయి నేను
చెంతఁ గూర్చుండి యాతని చింతఁ గంటి.

తనకోసము తలిదండ్రుల,
ననుఁగుందమ్ములను బాసి, యనురాగిణియై
చనుఁదెంచిన ప్రియురా లది,
చనిపోయిన దిట్టె కాల సర్పక్షతమై.

ప్రొద్దుట లేచి, తిండి తిని
పోయి, పొలమ్ములనో— మ రేడనో
యెద్దులవోలె కష్టపడి,
ఇండ్లకుఁ జేరి, యెదో భుజించి, పె
న్నిద్దురవోవు జీవులు జ
నించిన దెందుకొ ! శ్లేషకావ్యపుం
బద్దెము లట్లు క్లిష్టములు,
బహ్వాసమమ్ములు జీవితార్థముల్ !

పని చేయు తిండి కోసము,
తిను పనికోసరము జీవి ; దీని కొకం తే
వినఁబడదు, లక్ష్య మేదియు
కనఁబడ ; దీ సృష్టి యెవరి కష్టార్జితమో !

ఏల పుట్టినదో మొగ్గ, రాలు టేలొ !
ఏల పూచినదో తీగ యెండు టేలొ !
ఏల పెరిగినదో తోఁట, యేడ్పు టేలొ !
కార్యమే తప్ప, కనరాదు కారణము !

కంటి కాటుకఁదీసి, కంటఁ బెట్టెడి వేళ
మునిపంటఁ బెదవి నొక్కిన సుఖమ్ము,
ఫలరసమ్ములను గ్రుక్కిళుల నొఁడొౌ్ధ లంది
వుచ్చు కొన్న క్షణంపుఁ బూర్ణ రుచులు,

గున్నమామిడి కొమ్మఁ గూర్చుండి కోకిల
జంటగా నడిపిన చైత్రరథము,
పచ్చి కోపము మ్రింగి, పక్వ మాధురి త్రేన్చి
ఒకరి నొక్కరు దాఁగి యున్న నీడ,
పగటి కలలను నిశలందు వాస్తవముగ
ననుభవించిన నవకోటి యనుభవములు,
కాంతతోపాటుగ సమాధిగతము లగుట
నెంచి యెంచి, వెక్కి వెక్కి యేడ్చు నతఁడు.

శత సహస్రాధిక ప్రజా తతులు గల్గు
లోకమున నాతఁ డొక్క యేకాకి, తల్లి !
తనదు సర్వస్వ మామెతోడన గలించి
చింత కాతఁడు స్మారక చిహ్న మయ్యె !

తనువు తీరియు, నాశ తీరని వయస్సు
ఆవు రావురు మనుచున్న యాత్మ లనఁగ
క్రొత్త గోరీల గుమ్మాల గోచరించు
రంగు రంగుల చుక్క వెలుంగు లేవొ !

అందు నొక చోట నా వెలుఁ
గందుకొని ప్రసన్న వదనయై చూచిన, దే
మందు నది ? గాజు పెంకను
కొందును ! ఒక పుత్రుఁ జేరి కుందెదు నేమొ !

క్రొత్త సమాధి ప్రక్క నది
కొన్ని యుగాలటి ప్రాంత పెంకు, ఏ
పుత్తడిబొమ్మ పుస్తె తెగి
పోయిన యెట్టి విషాద గాథనో
చిత్తము మెత్తనౌ నటులఁ
జెప్పుచు నున్నది. తత్సమాధిలో
మృత్తిక గాని యస్థికలు
మేల్కొని యున్నవి దాని గోడునన్ !

ఈ గాజుపెంకునం దేమి రూపించును !
చిరకాల సంసార జీవితమ్ము,
ఈ గాజుపెంకునం దేమి దీపించును !
పారమ్ముఁ జేరని ప్రణయ యాత్ర,
ఈ గాజుపెంకునం దేమి కుమ్మొల్లును !
భర్తృ వియోగ దుర్భరతరాగ్ని,
ఈ గాజుపెంకునం దేమి శేషించును !
ఫుండయి వేధించు పూర్వ చరిత,
కాల మను రుద్రభూమి నగాధ గర్భ
మందు పూడిపోయిన యట్టి యాత్మ కథను
త్రవ్వుకొనుచున్న దట్లు నూతన సమాధి
భిత్తికల, పాప, మీ గాజుపెంకు నేడు !

ప్రేమ మధురానుభూతిలో వివశ మైన
సుక్షణ మ్మదో స్మృతివీధిలో క్షణమ్ము
తళుక్కుమనిపోయెం గాంబోలు, తమసిలోన
గలిసిపోయిన దది నేను కన్ను ద్రిప్ప!

ఆశతో వచ్చి జీవించి నట్టి దెవరొ,
తిరిగి పోయిన దెవ్వరో తెలియ లేక
కాటి దిబ్బను గట్టిగా కౌఁగిలించు,
మంటి పెల్లను ముద్దాడు మానవుండు!

ఆతఁడు కౌఁగిలించిన స
మాధి యనాదిగ వచ్చు మానవ
వ్రాతపు బాహు బంధములఁ
బ్రాఁబడి నట్టిదె, దాని క్రింద లో
లోఁతులలో నవంత గత
లోక మదృశ్యము చెందినట్టిదే,
చేతన నిట్లు రాల్చుకొని
జీవి భవిష్యము ద్రోదువోయెడున్!

భూత కాలమెల్ల బూది ప్రోవై యుండ
ప్రణయి నందు గుర్తుపట్టఁ గలఁడె?
పరిమళించు పసిఁడి పరమాణువుల నేరి
కొత్త బొమ్మఁ జేసికోఁ గలాఁడె?

కొమ్మ మీఁద మొగ్గ, గుమ్మాన లేఁ బుగ్గ,
పదము లందు లక్క, పైని చుక్క,
విశ్వమయత నంది విహరించు ప్రేయసి,
ఎందు లేదు చూచు డెంద మున్న ?

మానవ సమాజమున కంతు లేని నీడ
భద్ర వాటిక, దీనికి నిద్ర లేదు,
అలసి, సొలసి, చివికి, చిక్కి, కలఁగు దీన
జనుల కిది హాయిఁ గూర్పు విశ్రాంతి గృహము.

ప్రణయ గీతము వ్రాసి, బాగుండలే దని
చించి పారవైచిన చెత్త బుట్ట,
పెదలంక వంకాయ ముదిరిపోయిన దంచు
వంటిల్లు విసరిన పెంట కుప్ప,
చిఱచిఱ లాడించు చిత్త యెండకు వీఁగి
పరువెత్తి దాఁగొన్న తరువు నీడ,
ముద్దు తీరఁగఁ జేతఁ బుచ్చుకొన్న గులాబి
ఇటు జారిపోయిన యిసుక బురద,
దేని కవియే శ్మశానమ్ము, దాని లోన
జొరఁబడిన దేది యేనాఁడు తిరిగి రాదు,
ఇంత తెలిసిన విజ్ఞానవంతు డయ్యు
యువకుఁ డేలనొ దుఃఖించు నువిదఁ గూర్చి!

అతని విరహాగ్నిపైఁ గ్రాఁగి, యతని భావ
విభ్రమమ్మున స్మృతివీధి విస్ఫురమయి,
తెలిసి కొంటిని నన్ను నే, దిక్కు లేక
స్రుక్కిపోయిన ప్రేమ చిత్ జ్యోతి నంచు !

నరుఁడు కట్టిన కుటిల వర్ణ ప్రభేద
ఘోర కారా గృహమ్మును కూల్చఁ బోయి
దాని యిఱుకున బడి తా మె దగ్ధమైన
ముగ్ధ హృదయాల వాంఛా ప్రబుద్ధి నేను!

వారు నశించినారు తమ
వారి దయారహితమ్ములౌ దురా
చారము లందు కట్టె లయి,
స్వాంతము లందలి ప్రేమ రశ్మి చ
ల్లారక, మల్లె పందిరుల
నాశ్రమ వనమ్ముల పూచి, కాచి, యే
తీరున గూడ కోరికలు
తీరక విచ్చిరి దిగ్దిగంతముల్ !

ప్రేమ మనునది మానవ సృష్టిలో వి
శిష్టమైన మహోన్నత జీవ గుణము,
దాని సంతృప్తి పఱుప సాధ్యమ్ము కాదు
ఇతర రూపాల, నితర ప్రకృతి భవాల,

ఆనందానుభవ మ్మది
మానవునిదె, ప్రేమ దాని మహితావధి ; య
మ్లానముగా ప్రేమానం
దానుభవ మ్మొందు టొకటె దైవత్వ మిలన్ !

కొంచెమో, ఘనమో, యెట్టి కోర్కెనైన
తీర్చుకొనుటయె జీవి సిద్ధికి పథమ్ము,
ఫలితములు కాని వాంఛలే పట్టి నేడు
జగముఁ బీడించుచున్నవి చాల గతుల !

ఆ గతి ప్రేయసీ ప్రియుల
యాత్మలు ప్రేమరసత్వ సిద్ధికై
త్యాగము చేసికొంచు భవ
దాలయ వాటిని పర్యటించు, శ
క్తే గద లోక వస్తువు, స
తీ ! ఎవు డెక్కడ వారి యంశముల్
ఆగమ మానొ కూడి— అవు
డక్కడ రాగము పుట్టుచుండెడున్ !

నేను నా గాథ నా రీతి నెమరు వేసి
కొనుచు, తన్మయమ్మై యున్న క్షణము లోన
రుద్రభూమి సర్వమును కారుణ్యమయాత
వివశమయ్యె నా భావముల్ వినుచుఁ గనుచు !

అంతలో, నా ప్రియా వియోగాగ్ని తప్తుఁ
డశ్రువుల నొత్తుకొని లేచె, సతని తోడ
నేను లేచి ప్రయాణమైనాను కూడ,
పల్లెవఱకును సాఁగనంపఁగఁ దలంచి.

పైరు గాలికి చక్క పడగ విప్పిన పాము
        పుట్టపై కూర్చుండి బుస్సు మనఁగ,
కోటీశ్వరుఁడు వోలె కొమ్మపై నిద్రించు
        కోఁతి చివ్వున లేచి కొట్టఁ బోవ,
పశుల పంట పొలాలఁ బడి మేయ విడిచిన
        కొట్లగేదె యొకండు కొమ్ము విసర,
దొంగ యెవ్వఁడో దారి దొర్లించి పోయిన
        ముళ్లకంపలు కొన్ని పళ్లు నూఱ,
ఒక్కటిని గూడ గమనింపఁ దుండి లేని
యట్టి యంతర్ముఖుఁడు, చాల గట్టివాఁడు,
యువకుఁ డాత్మ గృహమ్ము డాయుటను జూచి
ఆఁగిపోతిని నే నొక్క లేఁగ చెంత.

ప్రొద్దు పోవు వఱకు పొలములో పనిచేసి
అపుడె వచ్చినట్టి యతివ యొకతె,
పాల చెంబు తోడ పశుశాల కేతెంచి
దయ్య మనుచు నఱచి కొయ్యబాఱె!

వ్యక్తమున మనసు వ్యక్తా
వ్యక్తమ్మున దయ్య మగుట నరయరు జను, ల
వ్యక్తులు గద యిప్పట్టున
శక్తీ! నిను జూడలేరు సరిహద్దు పయిన్!

భూతము పట్టుకొన్నది, వి
భూతిని తెండను హెచ్చరింపులకా
తాతలు కొంద రా గృహము . .
దాపున గూడుటఁ జూచి వేడ్క, నీ
పాఁత కథానికల్ శతము
పాడిన పాటలె కాన, నెవ్వఁడో
యేతము తోడు చుండ నట
కేఁగి చరించితి చెట్ల బోదెలన్!

పాడుపడి యున్న యా తోఁట బావి పైని
పాద మిడి నానో లేదో—— గభాలు మనుచు
బీట తీసిన యొక పొంత నీటఁ గూలె!
రైతు తను వంత ఝుల్లున ఱంప మయ్యె!

నిమ్మ తోఁటలు గడిచి, దానిమ్మ పూల
యద్దములలోన నను నేన దిద్దుకొనుచు,
అరఁటి తోఁటల నడయాడి, మిఱప చేల
నడుమ దిష్టిబొమ్మలఁ గాంచి జడుసుకొనుచు!

కంప తెగఁ ద్రెంపి, కొబ్బరికాయ తీసి,
చేతఁ బట్టుక దిగుచున్న లేఁత దొంగ
తోఁట యజమాని ననుకొని తోఁక ముడువ
కెవ్వు మని వాని బెదరించి నవ్వుకొనుచు ;

మల్లెపొద నొక్క యెడ నొక్క పిల్లవాఁడు
నిదురపోవుచు నుండఁ గాంచితిని నేను,
కాంచి యా ప్రాంత వృక్షశాఖలను జేరి
తూఁగు టూయెల నూఁగంగ సాఁగినాను!

మొదట ననుకొంటి నతని బొమ్మపయి నిల్చి
నాట్యమాడుదు నని, యేదొ నందనమున
ఎవరికోసమొ వెదకు నా యువకు మోము
అరుణ కాంతులతో నాకు వెఱపుఁ గొల్పె!

అతిగూఢ మ్మగు రాత్రి గర్భమున ని
        ర్వ్యాపారమై సృష్టి ని
ద్రితమై యున్నది, స్వప్న సంపదల భా
        తిన్ మిణ్గురుం బుర్వు లా
గతి నొక్కం డొక డీగతిన్ మిణిఁకెడున్ ;
        కల్హార గంధ మ్మదో
జతగాఁ బిల్చిన, పోయి, దాని యెడి సె
        జ్జన్ జేరి చల్లారితిన్!

---

# దీపసభ

## వీధి లాంతరు

ఎండ కన్నెరుఁగని యింతిని వేధించి,
అవని యంచులకు వాహ్యాళిఁ బంపు,
నరమామిడి వలంతి వర శిరోజములలో
కరములు గ్రుచ్చి నెత్తురులు లాగు,
వయసుడివోయి, యెవ్వరి యౌవనమ్మునో
ద్వేషించి బైలుతో దెబ్బలాడు,
తన యంతుఁ జూడఁ గోరిన ద్రోహు లని లేచి
మబ్బు కుట్టల మీఁద మండిపడును,
ధూర్తుఁడై యిట్లు వర్తించి తుదకు కాల
ధర్మమును తప్పఁకోలేక తరణి గ్రుంక,
సాటిలేని నియంతను సాఁగనంపి
చల్లఁబడినట్టు లోకము చల్లవడియె!

కఠిన యజమాని ముందు నౌకరు విధాన
అంత సేవ నేనెంతో ఆయాస పడితి,
కాల వృద్ధుని గదిలోని కన్యనైతి
నేను, నీ రెండ నన్ను స్పృశింపకుండ!

వెలి పుడిగి కన్ను దెఱచితి
పురపాలక సంఘు వీథిమొన దీపముగా,
పరగడుపున పని చేసెడు
నిరుపేద విధాన చాల నీరస మైతిన్ !

ఋషి బ్రతికియున్న భాష్యకారుని విధమ్ము
పగలె వెల్గింపఁబడిన దీపంపు బ్రతుకు,
బ్రతికి యేకీతినో బైటపడిన యంత
స్వాగత మ్మిచ్చె నాకు బజారు వీధి.

ఇఱుకు సందులు తనువెల్ల ముఱికితోడ
గుడిసెలకు మోసికొని పోవు బడుగు జనుల,
శిథిల వీధులు బ్రతుకెల్ల చింతతోడ
పాపులను మూసికొని పోవు సంద కడనె !

నీ కాని కోసమై నాకొట్టు తెఱతునా ?
పొమ్మని దొంగలాభమ్ము కసిరె.
చనువైన మాత్ర మూసిన పాపు తీతునా ?
రేపు రమ్మని లేఁత రేయి కినిసె,
పద్దుపై కొత్తడబ్బా తీసి యిత్తునా ?
రొక్క మిమ్మని సంతరోజు విసిగె,
అప్పేమి టిప్పుడీ యర్థరాత్రి నటంచు
పెళుసు గల్లాపెట్టి తలుపుమూసె,

జానపయి బెత్తెడును లేని జనపదమ్ము
అర్థి జనముల నే డిట్టు లాదరించు,
నగరముల మాట చెప్పిన నగుదు వేమొ!
కాలదోషము పట్టె లోకముకు, తల్లి!

గ్రామ పంచాయతీ పాడు తూము మీఁద
చుట్ట ముట్టించి తీరికూర్చుండె నొకఁడు,
పీల్చినవు డెల్ల చీకటి పెను పిశాచి
ఎట్టిగాఁ జూడ సాఁగిన దెవరి కొఱకొ!

అంత నొక బీడి యాచెంత కరుగు దెంచి,
చుట్టతో విడవేసెను సోదె నేదొ!
ఇంటి గొడవలు, పక్కింటి జంట కథలు,
వీధి తంటాలు దానిలో వేనవేలు.

ప్రక్క నున్న సోడా కొట్టు చెక్క మీఁద
కప్పురపుకిళ్లి తాలింపు కంపు కొట్టె,
శివుని గుడి ముందు గల మల్లెపువ్వుల తావి
సైడు కాల్వలు దాఁటియు సన్నబడదు.

పల్లె పొలిమేర కావల పగలు పగలు
మొగలి డొంకల దాఁగుడు మూఁతలాడి
చల్ల చల్లగ వల్లరి పిల్లగాలి
రేయిపైఁబడి, యూరెల్ల మేయ సాఁగె.

చినిఁగిన బనియనుతో, తల
మునిఁగిన కంకణుతో, యేమ్ప మొగముతో, పుట లూ
డిన పాత్రముతోఁ గడు చి
క్కిన బాలుఁడొకండు హైటుక్రిందికి చేరెన్.

ఊరి చివరనున్న పూరిండ్లలో నొక్క
నూనె లేని ప్రమిదెనుండి వెలుఁగు
కొఱకు వెదకుచున్న చిఱువత్తి యాతఁడు
చేరి తూము పైని కూరుచుండె.

పొట్టకోసము పగలెల్ల మట్టిమోసి
రాత్రి పూఁటల నాత్మ కోరకము నింత
వికసితముఁ జేసి కొనఁగోరి విప్లవతఁడు
ప్రాఁతకాలపు దొక పెద్ద బాలశిశు.

దీపమును దెచ్చుకొనుటకు దిక్కులేని
మలిన వస్త్రాన దాఁచిన మణు లవెన్నొ
నా వెలుంగున విరిసి విన్నాణ మొంది
దినమణిని మించి లోకాన దేజరిల్లు.

ఇల్లు లేని వాని కీవె పుట్టిన యిల్లు,
దీవె లేని వాని కీవె దివ్వె;
రాయి రత్నమౌను, రత్నమ్ము వసుధకే
దీపమౌను నీదు ప్రాపకమున.

నిదుర వచ్చెడు నందాఁక చదువుకొని యు
తండు కొంపకు పోయె, పాదములు నేలఁ
దడఁబడుచు నుండియును వాని తలఁపు విరిసి
భావి జీవన శిఖరాలఁ బరిమళించు.

ఫల మనుకొన్నవో, మధుర
పాకముగాఁ దలపోసె నేమొ, దో
మలు, పొడగువ్వ, లింక—పర
మాత్ముని ముద్దుబిడ్డ లెవ్వో
కొలకొల నన్ను ముట్టుకొని
కూలఁగ సాఁగెను నాకె పిండివం
టల గతి, చిత్రమయ్యె ఘట
నాఘటనమ్ముల ఘర్షణమ్ముటన్.

మూఁకగా మేరునగమును ముట్టడించు
శాంబరులువోలె, నను దాఁకి బహుముఖాల
ఘన పతంగాలు రెక్కలు కాలి కూలు
గాఢ తిమిరమ్ము లోనికి కాంతినుండి.

పాపకూపమ్ము లందుండు ప్రాణి యెందు
వెలుఁగు ముందు ముఖాముఖి నిలువ లేదు,
స్వేచ్ఛకోసము దీప మార్పెడు నె కాని—
భీమయును కాని దోమకు శీధువేల ?

ఆ విధమ్మున పుర్వులు నా వెలుంగు
తోడ పోరాడుచుండ, నా నీడ తోడ
సిద్ధపడినార లెవ్వరో యుద్ధమునకు
చోద్య మేమని క్రిందికి చూచినాను.

అది యొక విస్తరాకు, సగ
        మన్నముతో నట పారవేయఁ బ
డ్డది; యొకపంది, యొక్క నరుఁ,
        డా కబళమ్మె మహా ప్రసాదమై
బ్రదికెడు బక్క యావు నొక
        ప్రక్కకు నెట్టి భుజించ సాఁగినన్.
గదిసిన దొక్క కుక్క పిడు
        గా—పరమాణు మహాస్త్రమా యనన్.

ఆఁకటి నినాదములతో
చీకటిపై కుఱికి కుక్క చించినదా పు
ల్లాకు, నొక కొయ్యఁ గొని పె
ల్లాకులముగ నరుఁడు దాని నటు కాయించెన్.

ఆత్మమునకు, మఱి, యనాత్మమ్మునకు భేద
మరయఁ జాలినట్టి నరుఁడు, తల్లి!
కుక్కతోడ పొట్టకూటికి పోరాడు
స్థితిని జూచి నేను సిగ్గుపడితి.

స్వగతం బెయ్యదా చెప్పుకొంచు నొక రో
షారత్న మా యింటి వం
ట గదిన్ ద్రిమ్మరుచున్న, దా యనఁటి తోఁ
టన్ గ్రొత్త పెండ్లాముతో
మగఁడేదో సరదా యొనర్చెడు ; సినీ
మా వేళ కాఁబోలు, నీ
టు గుభాళింపున గోటు చేసికొని, బోఁ
టుల్ పోదు రే పట్నమో !

ముటికి కంపని రోసి ముకు మూసికొని, నోటఁ
బడిన దోమలకు శాపమ్ము లిడుచు,
పంక్తిపై యడుగుంచి, పంచాయతీవాళ్ళ
చావుఁగోరి, సొలోపు జాటిపడుచు,
కునుకుచున్నది లాంత రని, యింటి పనిచేయు
దాసి పిల్లను తిట్టిపోసికొనుచు,
ఇకిలింపుతోడ రానుకపోవు రౌడీని
" అత్తరు సాహేబ ! ఆవో " యనుచు.
పరులనెట్లో ఆకర్షింప బాధపడుచు
విసుగుతో పొంతవారిఁ దప్పించుకొనుచు
చిత్తకథ, లత్త కథలేవో చెప్పుకొనుచు
పడుచు పిల్లలు సినిమాకు నడచినారు !

ఊరు నూరెల్ల గాఢాంధకార వశత
మునిఁగి యున్నది నిద్రా సముద్ర మందు,
ఇక్క డొక దీప, మక్కడ నొక్క పొయ్యి
తెలుపు చున్నవి ముక్తజీవుల తెఱంగు.

మఱచిరో కిటికీల మాట, నావలి వీధి
గోడపైఁబడె ముద్దులాడు నీడ,
వీధి కోణము నేదొ వెఱపించె కాఁబోలు
ముసుఁగొక్క టీసందుమూల నక్క,
పడమటి పేటలోపల నేదొ గొడవయ్యొ
మొఱుఁగు చున్నది తూర్పుమొగను కుక్క,
గోశాల గుమ్మాల గుసగుస లటు జాఱి
రేరాణి పొదను చల్లారిపోయె,
అత్తరువు మాత్ర మగుపించు నతను నొకని
తఱిమి సంకెళ్లు వేసిరి తస్కరుఁడుగ,
స్వేచ్ఛలేని మానవ సంఘ సృష్టిలోన
రాత్రి జీవిత మీరీతి రకరకములు!

రేయి నెచ్చట బైలుదేరినవొ కాని
నీడ లొక రెండు చేరె నా నీడలోన,
వెలుఁగు మట్టముపై నెంత వేదమున్న
క్రింది లోఁతుల లేదు కోరికల కంతు.

తిండికోసము పగలెల్ల త్రిప్పులుపడి
శక్తి ఖర్చైన మానవ వ్యక్తి తాను
రేపటికి పూర్తి సత్త్వ మార్జించు కొనఁగ
ప్రణయదేవత రొమ్ముపై పవ్వళించు.

వరుసగ నెన్నిరాత్రుల త
పస్సున కీ ఫలమబ్బెనో, మహో
ద్ధురతర మైన డెందముల
తో నొకటొక్కటిఁజేరి, జీవ ని
ర్ఝరములు రెండు రాగ జల
రాశిని బొంది యదృశ్యమయ్యె, సుం
దరమగు నా సమైక్యము గ
దా, వరణీయము ప్రాణికోటికిన్ !

ఆ నీడలు రెం డొకటై
నా నీడను గలిసినంత నది మేదురమై
నానాముఖములఁ బోయెను,
మ్లానావని కెల్ల తిరిగి మధురిమ గూర్చెన్ !

నిలిచి తెల్లవార్లు వెలుఁగ వలసినదాన,
అర్ధరాత్రి ముందె ఆరిపోతి,
అనుభవమున తైల మమితమ్ము కాలెనో,
అసలు చమురుపోయు నతని వతనొ !

---

# దీపసభ

## విద్యుద్దీపము

బ్రహ్మ చేసిన బొమ్మ; చిత్రముగ తిరిగి
బ్రహ్మనే బొమ్మ చేసిన పడక టింట,
సూర్య కర్పూరదీపమ్ము సుందరముగ
వాణి జోకొట్టి, కొండెక్కి పండుకొనియె !

మొదట నే తరుశాఖాగ్రములు దినేశుఁ
జూచి స్వాగత మిచ్చెనో క్షోణి పైకి,
చివర నవియె వీడ్కోల్పి నిల్చెను, ప్రవాస
మేఁగు చెలిఁజూచు చెలులట్లు మూఁగవోయి !

అల గోదావరి లంక భూముల సమ
స్యల్ లేని సస్యమ్ము, కో
మలమై తీర సమీరునిన్ గలిసి చె
మ్మా చెక్క క్రీడించు, మే
ఘ లవమ్ముల్ వరరూపముల్ గొని తద
గ్రంబందుఁ గూర్చుండి శ్యా
మల సంధ్యా వరణాంగణమ్మున సిసీ
మా చూచు నట్లొప్పెడున్ !

కల్పాంతమందు జగత్సాక్షి వెల్గింప
తల్లి గీచిన నిప్పువ్రల్ల నుండి,
పని జూచుకొని, యుస్సురని సూర్యదీపమ్ము
నిట్టూర్పు విడిచిన నెరసు నుండి,
విస్ఫులింగములోని విశ్రాంత హృదయమ్ము
రాల్చిన వాంఛా కిరణము నుండి,
కరవల్లికా నఖాగ్రముఁ గ్రుచ్చుకొని లేచి
పరికించు నవ్యజీవనము నుండి,
లీలగాఁబుట్టి, నేను లోకాలఁ జుట్టి,
అణు వణువు నందు నవ్యక్తమై వసింప,
నన్ను విజ్ఞాన వాగురఁ బన్ని పట్టి
బానిసగఁ జేసికొన్నాఁడు మానవుండు!

పంకాలను త్రిప్పించును
లంకలు దున్నించు, బండ్లు లాగించు, ప్రతీ
లెంకయు విన బాడించు, న
హంకారము తోడ మనుజుఁ డవనిఁ నాచే!

ఉర్వి యొకరాత్రి, అందు సూర్యుఁ డొక దివ్వె,
దివ్వె తొలఁగినగాని లేదే సుఖమ్ము,
ఆది దైవతరూపమౌ నంధకార
మపుడె చేతన కానంద మందఁజేయు.

తళ్కు తళ్కున నే విశ్వత న్వాస్ర గ్న
రీ ప్రసారములన్ విహరించు చుండి,
ఎచ్చట, నెవండొ దబ్బున స్విచ్చినొక్క
పర్వ పర్వున పోయి దీపమ్ము నైతి!

విశ్వమయతఁ బాసి, వేగ నే నొకచోట
వ్యక్తమగుచు వ్యక్తినైన తోనె,
అంత దనుక లోన నజ్ఞాతమై యున్న
కాంతులెల్ల నన్ను కౌఁగలించె!

ఎచట నీవుంటి వంచు ప్రశ్నించు వారి
కేది కేని సాక్షాత్తు నేనే జవాబు,
తీగలందెల్ల నీశక్తి తిరుగుచుండి
అవి కలిసినట్టి చోటనె యవతరించు!

వెలుఁగొకటె పెద్ద చిన్న దివ్వెలను, కాని
శక్తిలో తారతమ్యాలు చాల గలవు;
ఎట్టి కృషినైన తరగతి హెచ్చుకొలఁది
అభ్యుదయ మందుచుందు వితోధికముగ.

శక్తిగా నుండి నే నొక్క క్షణములోన
కాంతిగా మారి నాచుట్టు కాంచినాను
మానవుని యాశ కొక లక్ష్య మనఁగఁబరగు
మంత్రి పదవి కమర్చిన మందిరమ్ము.

రేయికి రేయి కంతిపురి
రీతి వెలుంగుచు, వేడివేడి రూ
పాయలు పేర్చి గోడలకు
స్వర్ణము పూసిన సౌధమద్ది; నై
హాయస వీధి తారకల
హారతు లందుచు దేశపుం బ్రజా
దాయముఁ గొల్చు చున్నది సు
ధాంశువు కుంచముతో సురాళికిన్.

పాల దీపాల, మేలి పంకాల తోడ,
పడక కుర్చీల, జరిగ సోఫాల తోడ,
బల్లపై నొక్క మోపెడు ఫైళ్ళ తోడ
రాజ్య మేలును మంత్రి కార్యాలయమ్ము!

శాంతముగ మేడ యేడవ
యంతస్తున గూరుచుండి, యానాఁటిదయౌ
తంతును ముగించు, చేవో
మంతనములు చేయుచున్న మంత్రిని గంటిన్.

ఒకఫైలు నొక్క సంతకముతో ముగియించి,
ఒకదానిలో సిరా యొలుకఁ బోసి,
ఒక దరఖాస్తుపై రికమండుఁ జేసి, వే
రొకదాని బుట్టలోఁ గ్రుక్కివైచి,

ఒకసారి ఫోను తీసుక నేదో మాట్లాడి,
        ఒకదఫా తానెప్రత్యుత్తర మిడి,
ఒకచెవి కార్యదర్శికి నంకితముఁ జేసి,
        ఒకకంట లేఖ నేదో పఠించి,
ఒక్క గ్రుక్కను సిగరెట్టు నూఁదివైచి
బల్లపైనున్న ట్రే లోన బూర నూకి,
ఊపి రాడని పనిలోన నుండి కూడ
నన్ను జూచు చమాత్యుఁడు నవ్వినాఁడు!

కూలిపేటలకు వీడోలిచ్చి, క్రొత్తగా
        గ్రామమ్ములను పెంచి, కట్టు టొకటి,
ప్రథమ పాఠము మొదల్ పరిశోధనము దాఁక
        ఉచిత విద్యాదాన మొసఁగు టొకటి,
పల్లెలోఁగల భూమినెల్ల పంచాయతీ
        కిచ్చి, ఉమ్మడి సాగు తెచ్చుటొకటి,
పనిలేని కీడు, కొంపలు లేని గోడును
        నరునికి లేకుండ నడుపు టొకటి,
ఈ విధంపుఁ బ్రణాళిక లెన్ని యెన్నొ
అమలులో కొన్ని, ఫైళ్లలోన మఱి కొన్ని,
తీవ్రయోచన నిక కొన్ని తిరుగుచుండ,
మంత్రి పనిచేయుచున్నాఁడు మాని వోలె!

సాగు భూములు పంచు చట్టమ్ము తెచ్చిన
సరి నీకు నాకంచు చను నొకండు ;
త్వరలోనె భూమి సంస్కరణమ్ము తేకున్న
పార్టీకి స్వస్తి తప్పదను నొకఁడు
భూమి దాహముఁదీర్ప, కే మొగమ్మున పోదు
మీసారి వోట్లకం చేడ్చు నొకఁడు ;
ఆచార్య భూదాన యజ్ఞమ్ముతో కాల
మును ద్రోయవచ్చునె మ్మను నొకండు ;
ప్రజలచే, ప్రజకోసము ప్రభుత నెఱప
నెన్నుకోబడ్డ ప్రజలిట్లు, లెద్దు రొండ,
కెనుము నీడకుఁ బోలె పెల్లిదచ్చుచుండ
తొణకఁ డాతఁడు హిమ గిరీంద్రుని విధాన !

బద్దకస్తుల కొక్క బడి పెట్టినాము, ప్రా
రంభోత్సవము చేయ రమ్మటంచు,
అఖల ప్రపంచ మహాక్రిమి సభకు—అ
ధ్యక్షత వూనక తప్పదనుచు,
చౌప్పాపురాన పశు ప్రదర్శనములో
పాల్గొన దయచేయ వలయునంచు,
ఘనమైన గాంధీ పొగాకు కేంద్రవు దర్శ
నమ్మునకై వచ్చి పొమ్మటంచు,

లక్ష ప్రోగ్రాము లొక ముహూర్తమ్మునందె
పెట్టుకొని మంత్రివర్యుని పిల్పుచున్న
జాబులకు నెల్ల "రిగ్రెట్" జవాబు లిచ్చి,
పథకములు వేయు నభివృద్ధిపనుల కతఁడు!

నోట్ల కట్టలు కొన్న వోట్లతో రాలేదు,
పేదల మనసులో పేరు కలదు;
సభ్యుల దయవల్ల సచివుఁడు కాలేదు,
సూరి జనమ్ములో చోటు కలదు,
టీ. ఏ. కొఱకు పర్యటించెడు పనిలేదు,
కూటికై దెకరాల కొంగ్ర గలదు;
తనవాఁడు, కానివాఁడను భేదమే లేదు,
ఉపకార మొనరించు నూహ కలదు;
స్వార్జితము మీఁద బ్రతుకుచు, శక్తికొలఁది
ప్రజల కుపకరించుచు, మంత్రిపదవి కొండొ—
గోపురము గాఁ దలంపక, కువలయంపు
వొంపులను దిద్దనెంచు భావుకుఁ డతండు.

లంచమ్ము ముట్టక, లావు పాటించక
ఊరుపాలించు నుద్యోగి మీఁద
దొంగలెక్కలు లేక, దోపిడీ చేయక
ధర్మమ్ము నడుపు వర్తకుని మీఁద;

అవినీతి నోర్వక, ఆధిక్య మెంచక
మంచిగా బ్రతుకు సంసారి మీఁద,
లోటు మన్నించక, పోటీకి లొంగక
పనిచేయు సంఘ సేవకుని మీఁద,
లేని పోని నేరములు కల్పించి మించి
స్వార్థపరులు పెట్టెడు పిటీషనుల నెల్ల,
సత్యమును గూర్చి మంత్రితో సంప్రతించి,
కట్టలుగఁ గట్టుచున్నాఁడు కార్యదర్శి.

మా పేట పరశురామప్రీతి యైనది,
ఆర్తిఁ బాపు మటన్న వార్తలోన ;
మా డాళవా చేలు మాడిపోయినవి, కా
ల్వను విప్పుఁ డా యన్న వినతిలోన ;
మా మిల్లు మూసి పొమ్మన్నాఁడు ఖామందు,
బ్రతికింపు మన్న ప్రార్థనములోన ;
మా వాఁడి కన్నింట మంచి మార్కులు వచ్చె,
సీటేల లేదన్న మాటలోన ;
కనులలో నగ్ని, నీరును గ్రమ్ము గొనఁగ,
చూపులో తేమ, మంటయు రూపుదాల్ప,
తక్షణపుఁ జర్యకోస ముత్తర్వు లిచ్చు
కార్యదర్శిని మంత్రి కంగారుపెట్టె.

సరిహద్దు రక్షణాంశములపై మంత్రి వ
 ర్గము చేసినట్టి నిర్ణయముఁ గూర్చి,
ప్రక్క దేశపు స్థావరములపై నెగిరి, వై
 నము లేని పరవిమానమునుఁ గూర్చి,
క్రొత్తగాఁ గట్టిన కోదండ ఫేక్టరీ
 నిప్పు పెట్టెలలోని నిజముఁ గూర్చి,
ప్రేలఁబోవు ప్రపంచ పృథుల యుద్ధము నాపఁ
 గైకొన నున్న వైఖరినిఁ గూర్చి,
ఊఁకవలె రూకలను బొక్కుచున్న పాల
నా వ్యవస్థనుఁ గూర్చి ప్రశ్న పయి ప్రశ్న
లడుగు, చతి నేర్పుగా రహస్యములు లాగు
పత్రికల వారి కాతఁడు పట్టుపడఁడు,

దీక్షాపరుఁడౌ సచివుఁడు
దక్షతగల కార్యదర్శి దగ్గర నుండన్
లక్ష సమస్యలు తీర్చును,
నిక్షేపము చేయఁగల్గు నిఖిల జగమ్మున్ !

మంత్రి యారీతి కాలము మఱచిపోయి
బ్రతుకునే ప్రజాసేవ కంకిత మొనర్ప,
కడమ యుద్యోగు లందున్న పడుచువారు
మనసులను నిల్పుకోలేక సణుఁగు కొంద్రు !

చంటి బిడ్డకు చాల జ్వరముగా నున్నది,
కట్టరేమిటికి దుకాణ మనుచు,
సినిమాకు పోవుదమని చెప్పి వస్తిని
ఈ యాట కంతు కాన్పించ దనుచు,
ఫైళ్లకే జీవితం బమ్ముకొన్నా, మింక
చచ్చినవాళ్లతో సాటి యనుచు,
వృద్ధుల క్రింద నుద్యోగంపుఁ గర్మను
వ్రాసితి వేల దేవా, యటంచు;
బిడ్డ మేల్కొను ముందె ఆఫీసు కేడ్చి,
నిదురపోయిన తర్వాత నింటికేడ్తు,
మింక నెందుల కీశ్రమ యెల్ల నంచు
వయసులోనున్న పనివాఁడు వగతు రమ్మ!

పగలు పదిమొదలైదింటి వఱకు మాత్ర
మే సుమీ పనికాల మాఫీసు, కైన
రూలు దారి రూలుది, తనత్రోవ తనది;
నరుని బంధించు సూత్రమ్ము ధరణి లేదు.

వయసు పెరిగిన కొలఁది యౌవనము మఱచి,
ముదిమిఁగొని, మానవుఁడు శూన్యమును వరించు;
అను నిమేషము చేరు పూడును వెడల్చి
నింపు కోఁడెద క్రొత్త జీవంపు ధార!

ఆ సమయమ్ము నందు పద
　　హారు వసంతము లొక్క కుంచెతో
వ్రాసిన చిత్ర మట్టు లొక
　　రామ చటుక్కున వచ్చి, మల్లికా
హాస సువాసనాళి సచి
　　వాలయమున్ దనియించు, చెల్లరున్
భాసురచిత్తులై నిలువ,
　　బల్లను తట్టిన దాజ్ఞచేయుచున్.

"పగటి గుమ్మాన సూర్యుండు పని ముగించి
చాలసేపయ్యె, నే దేమి వేళపాళ ?
మఱచిరో ?" యంచు ప్రశ్నించి మంత్రి, నామె
చిన్ని నవ్వున ప్రక్కనాసీన యయ్యె.

"రవి విషయ మేల ? బాధ్యతా రహితుం డతండు,
మ్రొక్కుబడి తీర్చుకొని తోంక ముడుచుకొనును,
ప్రజల సుఖముకు ధర్మకర్తలము మేము,
మాకు విశ్రాంతి లే"దంచు మంత్రి పలుకు.

"ఆత్మలు గలట్టి ప్రజల సౌఖ్యమ్ములెల్ల
ప్రాణములు లేని ఫైళ్ళలో పట్టుపడెనె ?
లెండు లెం"డంచు నాతని లేపె నామె,
కార్యదర్శియుం బని నెల్లం గట్టిపెట్టె.

రాత్రి గర్భమ్మునుంచి చూఱగొని యెంతొ
పెన్నిధానమ్ము పవటికి పెట్టు నరుఁడు!
ప్రకృతిలో రేబవళ్ళ కేర్పడిన సమత
వ్యర్థమైపోయె నతని జీవనములోన!

బడుగు బిక్కులకై కట్టఁబడిన వసతి
గృహమునకు నామె కార్యదర్శిని, సమాజ
సేవ గౌరవ వృత్తిగా స్వీకరించి
సాయపడుచుండు జనులకు శక్తికొలఁది.

బిచ్చగాండ్రకు వృత్తి కల్పించు సంఘ
మున కమాత్యుఁ డధ్యక్షుఁడు, మొదటి సాలు
సరి సమావేశ మా రాత్రి జరుగవలయు,
వచ్చి కూర్చున్నదఁట కార్య వర్గమెల్ల.

ఆలస్యమైన యందుకు
చాల విచారించుచుంటి, క్షమియింత్రు కదా
నాలోప మంచు నాయమ
కేలూఁతగ నడిచి యతఁడు క్రిందికి పోయెన్.

వాన వెలిసి నట్లు, వరద తీసిన యట్లు,
సచివ మందిరమ్ము చప్పఁబడియె,
వెనుక నేను, నొక్క పనికాని బంట్రోతు
మిగిలి పోతి మేదొ దిగులు తోడ,

చూపులను గ్రుచ్చి, నాలోని సొబగు నెల్ల
లాగికొనిపోయినది యీ గులాబి మొగ్గ,
పని ముగించుక పోవు జవాను నంత
తలఁపు మధ్యనె నన్నాఁపి తలుపు మూసె.

నినుఁ గనుఁగొన్న కాంతి గల
నేత్రమె నీ సదనమ్ము, నీవ జీ
వన రసధార, వే రసపి
పాసువు నిన్ దనివాఱఁ గ్రోలు నా
తని కరమందు స్వర్గము స
దా జగమంతయు, నిన్నుఁ గొల్చి, నీ
ప్రణయము గెల్చు మానవుఁడె
బ్రహ్మ వినూతన విశ్వ సృష్టికిన్.

# దీపసభ

## సెజ్జ దివ్వె

రాత్రి యొడిలోని నవరత్నరాశి యామె,
ఆమె హృదిలోని యాశాసుధాంశు వేను,
మంచమున నామె, యెదుటి సెమ్మపయి నేను,
ఈడుజోడుగఁ గూర్చుంటి మెదురు బొదురు.

ఆ కోమలి కోమల తను
రాకారుచి రాంగ రాగ రమణీయతలం
దాకృతిఁ గొని, చనఁగా నా
యేకాకృతి, వెల్గినా ననేకాకృతులన్ !

విశ్వరూపము సాధించి పెట్టి నాకు,
తనువు తనువెల్ల నసుదాల్చి తరళితాక్షి,
దీపళమ్యకుఁ బోలె మూర్తీభవించి
నిర్మలాంతరంగము తోడ నినుభజించు.

ఎచ్చటనో, యెవ్వరినో తన హృదయమునకు
చేఁదుకొనుచున్న భావ పీచికల కాంతి
తళ్కుతళ్కున చెక్కుటద్దముల మీఁద
నవనవారుణ రుచులతో నాట్యమాడు !

మానప్రాయపు లే గులాబి మొగ్గలో
మర్మాళి మర్మమ్ముగా
తేనెల్ చిప్పిలువేళ, కా సుకను శ్రీ
తిన్ గ్రోలు నారంగ తా
జే నీ రేజపు సైదనం దలయునో,
ఏ యుత్సలోత్ఫుల్ల రం
గానన్ నాట్యము చేయునో, ఎవ రెఱుం
గన్ నేర్తు రస్వేస్థలిన్ !

వాస్తవమ్మును మించిన వాంఛ యేమొ
చంద్ర వదనమ్ములోన లాంఛనము కాఁగ,
కలువపువ్వని లేని మబ్బులను మునిఁగి
రేయి వేగించలే కొక్కకీతి నకలు.

సకుఁడా ! మేఘుని కేమి మంతనము లా
షాఢమ్ముతో ? చూత బా
లకు వాసంత సమాగ మోత్సవము నే
లా ? రమ్య సౌందర్య యా
త్రకు వర్షమ్మున కొక్కమాఱయిన ము
స్తాబౌను సత్త్వాత్మ, పూ
ర్ణకళామూర్తివి, గ్రోలవేల బ్రతుకం
తా రాత్రిగాఁ జేసినన్ ?

మధుర మధుమాస సహవాస మాసపడిన
కోయిల నెడారిలో పైదుచేయ నేల ?
దాసిఁ జేయఁగనేల భాద్రపదమునకు
మానస తరంగముల వెంట మసలు హంసి ?

పసిఁడి గొలుసుల నిర్మింపఁబడిన వైన
సంకెలలు సంకెలలె, కరచరణములను
కట్టి పడవైచు నది కల్పక ప్రసూన
తల్పకమ్మైన జాతవేదః పుటమ్మొ !

ఆరయు మేటి పూల కొఱ
కైములు కంచెల నైన దాఁటిపో
గోరును, తేనెనే పడయఁ
గోరును, కా నొక నాఁటికేని బం
గారు దుకాణముల్ వెదకు
నా మధుపమ్ము ? సువర్ణసౌధ సం
భారము లేల జాతి కుసు
మమ్మగ ప్రేమకుఁ జేరు జీవికిన్ !

జీవికి జీవికిన్ ప్రణయ
చేతన కల్పన చేసి, రెంటికిన్
త్రోవలు వేరుచేసి, కవ
దూరము చేసి, పరస్పరాను చిం

తావిల వహ్నిలో సమిధ
లై యవి కుమ్మిలుచుండ, చూచి మో
దావహ మొందు శక్తికల
దా యొక ఱిటున్న, నదేమి సార్థ్రమా ?

ప్రేమము దివ్య, మర్త్యు లీ ల
భించిన జీవులు ధన్యు, లైనసున్
ప్రేమ పథాన స్వేచ్ఛగ చ
రింపఁగ నీయ దిదేటి భాగ్యమో !
ప్రేమము లేని జీవితము
బీడు కదా ! నిరుపేద కొంపలో
శ్రామిక యేలి గడ్డి పువు
చాడ్పున ప్రేమకు దోయిలించెదున్ !

కోడి కూఁతకు మేలుకొని, దైవముఁ దలఁచి,
కొబ్బరాకుల చాఁప గోడఁజేర్చి,
తడిక తల్పును దీసి దరహాస మొనరించు
వేగుఁ జుక్కకుఁ గేలుసాఁగి మ్రొక్కి,
గుమ్మాన మామిడి గున్నపైని విభాత
గీతముల్ పాడు కోకిలను మెచ్చి,
వాకిటిలో తనశాకకై నిలుచున్న
చెలువంపు మల్లెను సిగను ముడిచి,

పైరుచే లంపుకొన్న యాహ్వాన మరసి,
మందమారుతముల తోడ మైత్రి నెఱపి
పొలముగట్టున పైనమై పోవునట్టి
శ్రమకుమారిక నాకన్న చాల మేలు !

తడికలే గోడలై యుండు గుడిసెలందు
దర్శనమ్మిచ్చుఁ దొలుతనే తా నుషస్సు,
రాతికోటల యంతఃపురాల కేసి
సూర్యుఁడే వచ్చినను తొంగిచూడరాదు !

కనకపు బందీ గృహమున
ధనలక్ష్మిని నేఁ గృశింతు, తటినీడల, క్రొ
న్ననఁ దీవల, పొలముల, ఫల
వనముల విహరించుఁ కూలివనిత యథేచ్ఛన్ !

ప్రకృతి సిద్ధములైన ధర్మములతోడ
సంఘ ధర్మాల కేనాఁడు సంధిలేదు,
ఏటి గట్టెంత పాటిదై మేటిదైన
గంగ కయ్యది శత్రు పక్షమ్ము కాదె ?

ఆకు బనిపి క్రింద నణఁగిపోయిన గడ్డి
పరక నీరసించి పాలిపోవు,
పారతంత్ర్య మందుఁ బడియున్న జీవికి
ప్రగతి లేదు, కడకు బ్రతుకె లేదు.

ఆలోన నామె మదిలో
నాలోచన మేదో తోఁచి, యీ కడఁగల లే
లా లేఖిని గైకొని, నా
ప్రేమాలన్ విరచించె నొక్క మోహన గీతిన్.

" వసంత మోహన వల్లిక నేఁడే
వాకిట విరిసిన దోయీ!
పూచిన పువ్వులు వాడక ముందే
పుష్పాడి గ్రోలఁగ దోయీ!
సుకుమారం బీ సుందర యౌవన
సుమ గుళుచ్ఛమని వినవో?
చూపులోనె మాయ మౌను, నీవ టె
చూచుచుఁ గూర్చుండినచో!
మడిసిన పుష్పము మనుపం గలవా?
గడిచిన ఘడియను తేఁగలవా?
రమ్మా, రమ్మా తమి తీరక ముందే
ప్రణయ ముహూర్తము కల దిందే!"

పల్లవమ్ముఁ బోలు పచ్చని కాగిత
మందు ప్రణయగీతి నంతవఱకు
వ్రాసి చదువుకొని, విలాస వైఖరి నామె
నవ్వుకొనుచు, దాని నన్నుఁ జేర్చె!

తత్క్షణమే ప్రమోదమున
తత్ప్రియ లేఖను ముట్టినేను, ప్ర
త్యక్షరమున్ గ్రహించి ఫల
హారము చేయుచు, తీర్చుకొంటి తీ
వ్రక్షుధ, ప్రేయసీ హృదయ
పాత్రను పక్వమునంది, లేఖినీ
వక్షము చేసినట్టి మధు
వాను నదృష్టము కల్గి వెల్గితిన్ !

ఆహుతిఁ గొంటి దీపారాధనపు వేళ
పరవశనైయె యున్న భక్తురాలి,
చవిచూచితిని సుఖ స్వప్నలోకములలో
శాంతిమై క్రీడించు చంటిబిడ్డ,
బలిఁగొంటి శ్రీరామ భజన సందర్భాన
సంపన్నమౌ గృహస్వామి గుండె,
భక్షించినాను దీపావళి నెపమున
లేహ్యమ్ముగా మిత్రు లేఁత బ్రతుకు,
రుచుల భేదమ్ములెల్ల నెఱుంగఁ గోరి
తినఁగరాని పదార్థముల్ తింటి నెన్నొ.
ప్రణయ మోహాన లేఖాక్షరముల లోని
కమ్మఁదన మెందు రుచిఁ గొన్న కరణిలేదు.

ప్రేమ రసపాక మటు గ్రోలి త్రేన్చి, నేను
సుదతి చూపున తృప్తితోఁ జూపు నిల్పి,
దానితోపాటు విశ్వహృదంతరాళ
విపుల వీధుల నెవరినో వెదకఁ బోతి!

ఆమె వేదననుండి యమృత భావన మొంది
వెలసి విరిసిన గీతి వినువీధి కెగసినది,
దిశలెల్ల మెట్టినది, నిశనెల్లఁ జుట్టినది,
శ్రుతిఁగలిపి, గతి నిలిపి, ప్రతిగుండెఁ దట్టినది.

సహకార సుందర శయన మందిరములో
        నెనరులో పలవరించినది పికము,
వాసంత వల్లికా వరద గర్భమ్ములో
        పొనరులో పులకరించినది మొగ్గ,
మలయానిలాలోల జలదాలయమ్ములో
        నెమ్మిలో జలదరించినది బొమ్మ,
సమధికోద్యద్రజోజవనికాంతరములో
        చెలిమిలో తొలకరించినది తార,

పట్టణమ్ముల, పల్లెల, పర్వతముల
మావితోఁటల, నాకాశమంటపముల
అలలుగా విశ్వహృదయ తంత్రులను దాఁకి
పొలఁతి గాథేచ్ఛ పైనమై పోవునపుడు!

నీవా, నీవా యనుచున్
ఆ విధి విరహాశ్రుగీత మరుగుచు, నొకచో
పూవుం దీవలలో ని
ద్రావశుఁడౌ నొక్క యువకు దాఁపున నాఁగెన్ !

అది విచిత్రస్వప్న, మమృతాంశు బింబాన
అంచు వెంబడి పాడుకొంచుఁ బోవు నతండు,
రాయి వ్రేటున నొక్క రమణీయ తారకా
నౌకపై నిటె వచ్చు నగుమోముతో నామె !

అమృత నవనీత మంత్రోత్సవా చరణుఁడై
అవకాశమున నాతఁ డవలీలఁ బరువెత్తు !
వెన్నెల కిరణాల వెండి తీవలు పట్టి
చుక్కాని వదలి యాచుక్క యిటు దిగఁజారు.

అంచు జారిన, క్రింద నంతులేని సమాధి
తెగునేని కిరణమ్ము. మిగిలేది శూన్యమే,
కేలు సాఁచె నతండు, కాలు తీసిన దామె,
అతఁడు నిగిడెను పైకి, ఆమె క్రిందికి దూఁకె ?

జిల్లున పూల వాసనలు
చిమ్మినమాడ్కి, రసాల శాఖపై
మెల్లన కోకిలమ్ము గళ
మెత్తిన రీతిగ, తత్క్షణమ్మునన్

హ్మల్లత నిల్చి నాట్యమొన
రించుచు నాతని మేలుకొల్పె, నా
పల్లవ పాణి ప్రేమ వర
వల్లకి మీటిన రాగ వీచికల్.

ఆతఁడొక పేద బాలుఁడు,
ప్రాతః కాలముగ తోఁటపని చేసి, శ్రమో
పేతుండై, స్వప్న జగ
న్నాతను సేవించువాఁడు, తాపసుఁడు సదా!

" మానస సరోవరమ్ములో, మధ్యలోన
ఫుల్లమైన దీ గంభీర పుష్ప మనుచు
ప్రియుఁడ! వెనుదీతు వేమొ, నీ ప్రేమ కొఱకె
ఇంత లోఁతున నిల్చి తపించు నీమె "

మానవ కల్పితంపుఁ గుసు
మమమ్ములఁ దేనెలు లేవు, తావులున్
గానము, వర్గభేదములు
నంటియు, కావున లేచిరమ్ము; ఈ
పైనవు రంగులన్ దుడిచి
వైచి నిజాశయమేలు కొమ్మికన్
పూనిక, నంచు నీవొ పిలు
పుల్ వినిపించు నభః పథాలలో

మేలుకొని యతఁడు, చేతుల
బాలామణి లేమి కేమొ భయపడి, చుట్టున్
గాలించెను, తనుఁ దాఁ బరి
శీలించుక నుస్సురంచు చింత మునింగెన్.

కలను, కలఁగన్న కాంతను దలఁచుకొనుచు,
మంచె దిగి, మల్లెపొద నొత్తిగించె నతఁడు,
తన హృదిద్వార మెవ్వరో తట్టినట్లు
దిగ్గునన్ లేచి కిటికీని తెఱచె నామె !

తెఱచిన తత్క్షణ "మవురా
దొరికితి విన్నాళ్ళ" కంచు దూఁకెను నాపై
విరిముద్దుల యెంగిలి మొగ
మెఱుఁగుదు నిన్ననుచు నే నదృశ్యం బైతిన్.

# దీ ప స భ



## మిణుఁగురు

మిణుఁకుచు, నర్ధరాత్రి పొలి
　　మేరలు దాఁటి గమించు నొక్క పాం
థునికి రవంత తోడ్పడుచు,
　　తోన వనాంతరమందు నో ప్రభం
జను నపహాస్య కేళికి వ
　　శం వదనై, నవచూత మాధవీ
ప్రణయ కళా కలాప రుచి
　　రాంగణ మందు నిమేష మాఁగితిన్.

ఈఁత గెలకును, మామిడి యిగురుఁ గొమ్మ
కొకట దారము పోసి, వాగురలు పన్ని,
మాటియుండిన సాలీని మాయ చేసి.
బైటపడి, పరువెత్తితి ప్రాణభీతి,

పొట్టతోనున్న దాళవా పొలము లందు
నేను పర్యటించితిని నిర్నిద్రగతిని,
కాఁపు నోటను గల చుట్టగాఁ దలంచి
కలుఁగులను దూఁకినవి మూషికములు బెదరి !

నవ్వుకొను చేను, నటనుండి రివ్వు మనుచు
తాళ్ళకట్టవలంబడి తరలి పోవ,
ఏడ్చు బిడ్డని తోడ తా నేడ్వలేక
భూతమని నన్ను జూపించె మాత యొకతె!

అంతట భూమి వ్యర్థమని,
ఆకస మందు ప్రయాణమై. మహా
ధ్వాంతము చీల్చి లోకపు హృ
దంతరమున్ బరికించు నిద్ధ శు
ద్ధాంతపుఁ దారయుంచు, జగ
దంతములన్ బడు నుల్కయుంచు, వి
భ్రాంతిని శాస్త్రవేత్తలు వి
వాదము లాడఁగ నే జరించితిన్ !

అట్లు త్రిమ్మరు నన్ను విహంగ మేదొ
పట్టుకొనిపోయి తన గూటఁ బెట్టుకొనియొ,
కులికి, కిలకిలమని, పక్షికూన లంత
వెచ్చవెచ్చగ నా చుట్టు వచ్చిచేరె!

ఆమోదమ్మున, తల్లి తెచ్చిన ఫలా
హారమ్ములన్ బాల చం
చూ మంజిష్ఠరుచుల్ ప్రఫుల్లములుగా
క్షుద్వహ్నిఁ జల్లార్చి, యా

రామోక్ష్వజ శిరోగ్ర పుష్పముల శ్రీ
　　రఁబిఁత సేవించి, నన్
ప్రేమన్ జూచుచు నిద్రపోయె జనయి
　　త్రిన్ జేరి తచ్ఛాభజముల్ !

కొంత తడవట్టులా పక్షిగూఁటి దీప
మై వెలుంగుట సంతోషమయ్యె నాకు,
జీవరాశికి చేసిన సేవ తృణమె
యైన, నది కోటిసేయు, దివ్యత ఘటించు.

అచట నా పీఠమది పండుటాకు కాన,
బాల పల్లవములతోడ మేల మాడ
వచ్చు పవనాంకురములతో పంతగించి
రాపిడికి తట్టుకోలేక రాలిపోయె !

అది యొక లతా కుటీరము,
సదమలమై, శాంతమై, ప్రసన్నంబై యు
న్నది కణ్వుని యాశ్రమ మటు,
హృదయమ్మున కందుఁ గలుగ వే భారమ్ముల్ !

ఆనందమ్మున నంత, స్వప్నము నిజ
　　మ్మైనట్లు విభ్రాంతితో,
ఈనల్ తీయని కొబ్బరాకు చదరే
　　ఏ యిందు బింబాంతరో

ద్యానోత్సంగమొ గాఁ దలంచు తరుణున్,
ఆశా పరిష్వంగ హే
లా నిర్వాహ వరీయుఁ గాంచితిని, బా
లప్రాయు నవ్యాకిటన్ !

కన్ను తెరువకయే గాలిఁ గౌఁగలించి,
అతఁడు పొందిన సుఖమున కంతులేదు !
పైకి కాన్పించునది వట్టి బయలెగాని
దాని యొడిలోన గలదు సౌందర్యమెల్ల !

"పోదా"మని లేచి, యతం
"డేదీ ?" యని చూచి, తీవటిండ్లను "మీతో
లేదా ?" యని ప్రశ్నించుచు
ఆ దరి కీదరికిఁ బోవు నప్రతిభుండై.

మబ్బువిడిన యొండ మాడ్కి నాతని మాన
సమ్ము క్షణములోన సహజ మాయె,
సత్యమరసి యతఁడు, స్వప్నమ్ము దలఁచుచు
నీరసముగ మంచెఁ గూరుచుండె !

రాత్రి సృష్టింపఁ బడియె విశ్రాంతి కొఱకు,
పవలు కోల్పోయినట్టి సత్తువుల నెల్ల
గుప్తముగ వాప సిచ్చెడి సుప్తి లోన
కలల యల లేవొ పైకొని కలఁచు నరుని !

నిఖిలలోకము హాయిగా నిదురపోవ,
ఏమిటో భావకల్లోల మెడఁద లోన!
తోఁడి దొంగకుఁ బోలె మధూదయమ్ము
పరిమళమ్ములు పీచి తుపాను రేఁపు!

ఆతని తోడ నేను విర
హ వ్యథఁ గుందుదు నన్నయ ట్లైదో
యాతన నన్నుఁ జుట్టుకొని
యార్చిన, నూర్చుచు నే మహోగ్రమో
చేతముఁ గ్రుచ్చి లాగినటు
చివ్వున నాతఁడు లేవ లేచి, సం
కేతము నేదొ యెంచి యెట
కేఁగిన నేఁగుచు తోడు పోయితిన్.

ఒకదాని వెన్నున కొక టానుకొని, నిద్ర
లలిఁ దోఁగు మేక పిల్లలను గడిచి,
నెమరు నేయుచు శయనించి, రేపటి తలం
పులె లేని బండి గిత్తలను గడిచి,
కాపలాలో కుప్పకడ నేవొ దొంగల
కలఁగాంచు పాలికాఁపులను గడిచి,
కొబ్బరాకుల తుంటఁగొని, మావి తోఁపుల
నడయాడు కుఱ్ఱ కుంకలను గడిచి,

ఏ నవోజ్జ్వలాదర్శమో యిరుల తెరలు
తొలఁగఁ ద్రోయుచు మార్గమ్ము తెలుపుచుండ
కుక్క, పాము, దెయ్యము నేమి లెక్కగొనక
పాంథుఁ డాతఁడు సాగించె ప్రణయ యాత్ర!

కొని ప్రేమము లక్ష్యమ్ముగ,
చను విమల మనస్కునకు, విశాలాత్మున, కెం
దును నడ్డుగలుగ, దోటమి
యును ముట్టదు పథ మపార, మున్నత మగుటన్.

వెలుఁగునే నమ్మి నూటిగ వెడలు వాఁడు
గడపలో నెప్పటికి నైన నడుగు మోపు,
ఎవ్వఁ డాదర్శహీనుఁడై యిలఁ జరించు
చుండు, నాతఁడు తిరిగిన చోటె తిరుగు.

ఏ ప్రఫుల్ల హృదయమో ప్రేమగాథ వా
సనలు వీచుచున్న జాడ నతఁడు
వల్లకాడు లడ్డఁ బడిపోవు, డొంకలు
దూరిపోవు, నదులు దాఁకిపోవు!

అపుడే తూరుపు కొండ గుమ్మమున నే
ణాంకుండు ప్రత్యక్షమై,
విపులా సుందరి శూన్య నేత్రములలో
వెల్గించె దీపమ్ము, త

త్సుపరీరంభ పునః పునః ప్రసరిత
జ్యోత్స్నాతరంగాలలో
తుప క్రీడించును స్నానబుద్బుదము లా
• శల్ నిండి మిన్నంటఁగా !

తుమ్మెద యొకండు భ్రాంత పద్మమ్ము నుండి
తప్పుకొనిపోయి తన కాంత మెప్పు నందె,
చిన్నది యొక ర్త గట్టుపై చెట్టు నీడ
ఎదురు చూచుచు నిల్చున్న దెవరి కొఱకొ !

" అరవిందమ్ములు చూచునన్ భయము లే,
దాశావకాశమ్ము ని
ద్దురలో నున్నది, ప్రేమచంద్రుకర సిం
ధూరానురాగానుమం
గ రుచిన్ గ్రోలి ప్రఫుల్లమై వెలయు మిం
కన్, చైత్ర కాలమ్ము నీ
కొఱకిం దాఁగిన, దీ క్షణమ్ము వృథగా
కుండన్ బ్రవర్తిల్లుమా !

" కలువ లలరవు వెన్నెల కలుగకున్న,
హృదయములు వికసింపవు ప్రేమ లేక,
వలపు తలఁపుల జాబిల్లి వచ్చినపుడె
చీకటులఁ బాపుకొనుమమ్మ జీవితమున !

"హృదయ పరిమళ్యములన్
హృదయేశుని నింపి, వివిధరీతుల ప్రణయా
స్పదు నొనరుచు కొమ్మ, రసా
స్వదనోన్ముఖుఁ జేసికొమ్మ వాసంతికవై!"

తాను నిలుచున్న విపుల చూత ప్రసూత
మెల్లగా నిట్లు చెవి నూఁది మేలు కొలుప,
తీవ్ర విరహాగ్నిలోఁ గ్రాఁగు తీవఁబోణి
ఉజ్జ్వలిత వేగ వాంఛల నూఁగిపోయె!

రత్నదీపికా సందీప్త రాగ రక్త
కుంద మందార తల్పాన గొంత సేపు,
గృహవనోదార గోదావరీ మనోజ్ఞ
కుముద కాసార తీరాన గొంత సేపు.

నికట మల్లీ నికుంజ రంజిత సుధాశ
రోపలార్ద్ర వేదికఁ గొంత సేపు, ప్రియ శ
కుంత శాంత నీడము చెంతఁ గొంత సేపు,
గున్న మామిడి కొమ్మలోఁ గొంత సేపు.

కూర్చుండుచు, లేచుచు, ని
ట్టూర్చుచు, హిమశీధు బిందుయుత పత్రములన్
చేర్చుచు మొగ, మా మగువ వె
లార్చెన్ మన్మథుని వెదకు రతి సోయగముల్.

రాత్రికి చంద్రోదయమై,
ధాత్రికి మధుమాసమై, వ్యథాహృదికి సుధా
పాత్రమై, యానెచ్చెలి
నేత్రాలకు యువకుఁడానె నిశ్శ్రేయసమై!

కాసార మజ్జాస వాసారముల తోడ
మంగళస్నాన ధర్మమ్ము నెఱప,
పరిఫుల్లవివిధ పుష్పముల పుప్పొడి చేరి
అవలేప లాంఛనా లాచరింప,
జిలుఁగు వెన్నెల పట్టువలిపమ్ములను బెట్టి
చందమామ శుభమ్ము సంతరింప,
కాంచన తిలకమ్ము, కజ్జలమ్ముగ—వెల్గు
చీకట్లు భక్తితో సేవచేయ,
మల్లెమొగడలతో తలంబ్రాలు పోసి
తల్లి వనలక్ష్మి పరిణయోత్సవము చేసె,
ప్రకృతి రెండర్థములు పరస్పరము చేరి
పూర్ణతను గోరుకొని కేలుమోడ్చి నిలువ!

ధనిక కార్మిక భేద మింతైన లేదు,
అగ్ర జాంత్యజ చింత నుంతైన లేదు,
లోక మని, సంఘ మని జ్ఞప్తిలోనె లేదు,
పరమ పావనమా వారి ప్రణయ మందు.

మొగ్గ యేర్పడియెను మోహన మల్లికా
　　　వల్లికా రమ్య భావమ్ము నందు,
పిందె రూపొందెను పేశల లీలా ర
　　　సాలబాలా గర్భ గోళమందు,
మధువు చెమర్చెను మంజుల మందార
　　　కన్యకా నవ్యోష్ఠ కలశ మందు,
సుంకు రేకెత్తెను సుందర భూసతీ
　　　సంతోష శీతల స్వాంత మందు,
పుష్పమై, ఫలమై, మధుపూరితమయి,
గృహ నవోద్యాన లక్ష్మియై రేపు వెలయు
ప్రకృతి నటఁజూచితిని స్వయంప్రభవ మగుట
ముగ్ధదంపతు లిడుకొన్న ముద్దులోన.

ప్రకృతి తను నాళనాళాన పరమపురుష
తేజ మొకరీతిఁ బ్రవహించు తెలివి లేక,
నిత్యకామ ప్రదారూప నిన్నుఁజూచి
ధన్యునైతిని వారి ప్రత్యంగకముల.

మల్లె నీడలలోన మాయమై యతఁడేఁగ
　　　రెమ్మకో పుష్పమై కొమ్మ వెదకు,
కలువ కొలంకు లోఁతులలో నతఁడు దాఁగ,
　　　వెన్నెలయై యామె వెదకి పట్టు,

పూలపందిట తీగ డోలగా నతఁ డూఁగ
పైకొని పంతాన పట్టి తెచ్చు,
ఇసుకతిన్నియ నవ్వు ముసుఁగులో నతఁ డాఁగ
తెమలని తగ వేదొ తెచ్చిపెట్టు,
నవ నవోన్మేషము లయి మానసము లొకటి
నొకటి పెనవేసికొని తుది నొకటి కాఁగ,
రస జగత్తున కైకైకరాజ్ఞి పదవి
కడఁగి ధ్రువ మయ్యె నపుడు శృంగారమునకు.

వారి ప్రేమానురాగ విహార శోభ
స్మృతికి తెచ్చెను నాకేదొ గత చరిత్ర,
మధుర నిర్వేద మర్మసమాధి మునిఁగి
నీ లసత్స్వాద పీఠాన దేలినాను.

# దీపసభ

## కలకలము

రయిలు మూఁడవ తరగతి రాత్రి కెల్ల
ప్రతినిధి నటించు నొక్క దీపమ్ము లేచి
నాగరికయుగ మందు మానవ సమాజ
మెంత యున్నతిఁ గనెనొ వర్ణింతు ననియె.

పెద్ద నగరాల వీథుల పేవుమెంట్ల
పైని జీవించుచున్న నిర్భాగ్యనరుల
హీన ఘట్టాలు వర్ణింపనిమ్ము నన్ను
దేవి! యంచును నొక గ్రుడ్డిదీప మనియె.

చెన్నపురి నుండి ఢిల్లీకి చేరులోన
నేను చూచిన చిత్ర సంకీర్ణ జీవి
తములను సమీక్ష చేతును తల్లి! యంచు
ఒక విమాన దీపమ్ము కూర్చుండె లేచి.

పైని చుక్కలు, క్రింద చేఁపలును ఝళుకు
తళుకు మనుచుండ, తత్ప్రభుత్వముల మధ్య
మేటి సరిహద్దు వలె పోవు బోటు మీఁది
గాథ చెప్పెద నని లేచె కళిక యొకటి.

వెలుఁగు చీకట్లు కలఁబోసి, పిండి పిసికి,
విశ్వనౌకలు నిర్మించి విడుతు వీవు,
దారి వాటికి చూపించు భార మొఱుక
పఱతు ననియె దీపస్తంభ కిరణ మొకటి,

బండి కావచ్చు, ఓడ కావచ్చు, నేన
ఆఁగి పొమ్మన్న టక్కున నాఁగిపోవు
నామహాత్మ్యమ్ము వర్ణింతునా, యటంచు
ఎఱ్ఱ దీపంబొకండు గొంతెత్తె నపుడు.

పువ్వులును, పండ్లు తెచ్చి నీ పూజనుంచి
గొల్లభామ యొకర్తు నిన్ గొల్చువేళ
ఆమె పసిబిడ్డ చేసెడి యల్లరులను
తెలుపుదునె, యంచు కర్పూర దీప మడిగె.

గుస గుస లాడ సాఁగినవి
కూర్చుని రెండు మనోజ్ఞ దీపికా
ప్రసవము లొక్క వేదికను,
వాని కథాంతర మంగళార్థముల్
విస విస ప్రేమ వాసనలు
వీచుచు నున్నవి, ప్రీతి నెట్టి ప్రే
యసి ప్రియు సద్మయుగ్మ విర
హాగ్నుల వెల్గి తరించినట్టివో!

పాశ్యపుస్తకములు పాఱవైచి, ప్రేమ గీ
 తము వ్రాయఁగడఁగు విద్యార్థి తీరు,
పరుపులో దాఁచి, యెవ్వరుఁ జూడకుండ "ము
 ద్దుల మర్మ" మరయు వృద్ధుని చరిత్ర,
కమ్మని కథ నొండు రొమ్ముపై బోర్లించు
 కొని నిద్రఁగాను భావుకుని వయస్సు,
కావ్యకన్యక తోడఁ గలలెల్లఁ జెప్పుక
 ఉపశాంతిఁ గను విప్రయోగి గాథ,
నేన వర్ణింతు, నేన వర్ణింతు నంచు
ఉల్లములు పొర్లి యుబలాట ముఱక లిడఁగ
లేత దీపాలు సోఫాల లేచి పలుట
కలకలమ్మున సభయెల్లఁ గలఁకఁ బాఱె!

ఇది చూచి దేవి వదనము
కదిలెను, తోఁదోన నెల్ల గడబిడ యుడఁగెన్,
మెదిలెను పెదవులు వీణా
రదనమ్ములు దాఁటివచ్చు రాగధ్వనులన్.

"వర వాసంత సుమాసవ మ్మటుల, వి
 శ్వశ్రేయమే సాహితీ
పరమార్థమ్ముగ, వాక్సతీ చరణ సే
 వాధీనుఁడై యెవ్వఁడ

శుభయోగమ్మున నుండు, నాతని గృహో
　　　　స్థానంపు దీపం బెదో
విరతిన్ దెల్పి సమాప్తిఁ జేయుత సమా
　　　　వేశ మ్మిఁకన్ నేఁటికిన్"

నెమ్మనమై దేవిచేసిన నిర్ణయమ్ము
మధురమై యట్లు మలయజ మట్లు వీవ,
గప్పుమని, గుప్పుమని దీపికా శతమ్ము
విచలిత మ్మయి, ఊహాలు వెల్లి విరిసె!

ముందు వరుసల దీపాలు మొగమొగాలు
చూచుకొను, చిందు వందును జూడ సాఁగె,
వెనుక వేదికలం గొన్ని కునుకు చుండె,
మూలఁగల వేవో సొదలు చెప్పుకొనఁ దొడఁగె.

సంప్రతింపఁగ సాఁగె స్వర్ణ కారుని కుంప
　　　　టినిఁ జేరి యొక చోరు నింటిఁ బత్తి,
మనుజుల పెండ్లిండ్ల మాయతంతులఁ గూర్చి
　　　　తిర్లిక కాఁబోలు తెలుపుచుండె,
కన్నుగొట్టినది రిక్షా లాంత రొక్కటి
　　　　కల్లుచిల్లర కొట్టు కాగడాకు,
ద్యూతగృహ స్నేహమో కాని, పది యినం
　　　　జీ దీపములు ఛేయు నేదొ గొడవ,

మూలఁజేరిన రెండు కాబూలు వాని
కొట్టు దీపా లేదో లెక్క పెట్టుకొనును,
పూలఁదోఁటను బోలు దీపాలు తుదకు
స్వేచ్ఛఁ గైకొని యల్లరి చిల్లరయ్యె!

చూచుచున్నవి నిగిడి యుత్సుకత తోడ
పండితుల యిండ్ల మేటి దీపమ్ము లేమొ!
కవుల దీపాలు కాఁబోలు కమరుచున్న
పూవిరాడని, తోఁచని యూఁగులాట!

అతఁడు వ్రాసినది బాక్సాఫీసు దృష్టితో
ఔచిత్యమునకు లేదందు చోటు,
ఆ రచయిత కూర్చినవి పద్దియమ్ములే
కాని, రసమ్ము చుక్కయిన లేదు,
ఆ కుట్టువానికి లోక మర్మము కాదు
కానికి కావ్యమ్ముగా రచించు,
ఆ యువకఁడు రాజకీయ ప్రచార చం
పువు వ్రాసి, దాని నభ్యుదయ మనును,
కళకు మానవ హృదయ వికాస మొకటి
పరమ ధర్మవు, ప్రతిపాద పద్మమందు
రసము చిప్పిలు కావ్యమ్ము రచనచేయు
కవిది గద నేఁడు దేవి యగ్రాసనమ్ము?

తరుణ భావంపుఁగని నుండి త్రవ్వి తీసి
ముడి సరుకునే బజారుకు మోయునట్టి
అపరిణత మనస్కుల వ్యవహార మెల్ల
సరస వస్త్వాపణముల నిష్ఫలము కాదె?

ప్రకృతి యొడినుండి సహజ సంపదను దీసి,
భావనాజ్వాల మీఁద పక్వమ్ముఁ జేసి
ప్రజల హృదయమ్ముఁ బెంచులే ప్రతిభగాని
పచ్చిరొట్టను వడ్డింప ఫలిత మేమి!

ఈ విధమ్మున బల్కుచు, "నేన సుకవి
దీపసఖి" "నే మహాకవి దివ్వె" నంచు
లేవ యత్నించు చెలుల కై దీవ లంది
తివుచుఁ గ్రిందికి పండిత దీప వితతి!

క్షణములోనెల్ల గడబిడ సర్దుకొనియె,
ఆవరణ మెల్ల నిశ్శబ్ద మావహించె,
తేటగా నొక్క మామూలు దివ్వె లేచి
నిబ్బరమ్ముగ సభలోన నిల్చినంత!

---

# దీపసభ



## ప్రమిదె దీపము

శ్రీకారమ్మన, మోహనమ్ముగ నినున్
జిత్రించి, నీచుట్టు బ
హ్వాకారమ్ముల రమ్యవృత్తముల శో
భల్ దిద్దుచున్, తద్ర సో
త్సేకమ్మందున నిన్ను ముంచు కవి నిం
దే ముంచి లాలించు నీ
సాకూతస్మిత రోచిరేఖకు నమ
స్కారమ్ముఁ గావించెదన్.

నీవే నేనని యెంచి, గోడ నడుమన్
దీగూఁట నన్నుంచి, యే
నీవున్ నేనును గాని తత్త్వమున శ్రీ
నీడన్ గలమ్మంది, భా
వావేశమ్మును గోరు భావుకుని హృ
త్పద్మాంక పీఠమ్ము నం
దే వాగీశ్వరి వీణ నందుకొను న
ద్దేవిన్—నినున్ గొల్చెదన్.

కోయిలవోలె పాడుటకు,
        గోముగ బర్హి విధాన నృత్యమున్
జేయుటకున్, తథా ప్రముఖ
        నిద్ర వసించిన వేళ లేచి యా
త్రాయతశీల మాట కని
        వ్రాసి, కసన్ రసపూర్ణ మానసవా
ధ్యాయముఁ జేర్చినట్టి కవి
        తా పరశక్తికి కేలు మోడ్చెదన్.

మూఁగ తనమ్ము నూని, "పిక
        మున్ శుకమున్ బలె మానవుండ నై
యేగతిఁ బల్క నేర్తును మ
        హేశ్వర!" యంచుఁ దపించు భావనా
వేగ మనస్కుఁడుండు నెడ,
        విశ్వ రహస్యము విప్పి, లోనికిన్
స్వాగత మిచ్చు రాగవతి,
        నాగమ రూపవతిన్ నుతించెదన్.

"రసరూపమ్ము నెఱుంగ, లోకగతి నా
        ర్ద్రమ్మైన చిత్ క్షేత్ర మం
దు సదా పుట్టెడు భావనాంకురములన్
        బోషింతు, తద్వాటి ర

క్కాస కంపల్ తొలఁగించి, పువ్వుల నొసం
గే బాధ్యతల్ నీవె'' యం
చు సమర్పించు ప్రబంధకర్షకునికిన్
దోడ్పోవు నిన్నెంచెదన్.

"ఇదిగో రమ్మ్మ, రస స్రవంతు లివి నీ
హృన్నీరధిన్ నింపుకో;
మ్మదిగో లెమ్మ్మ, సుధా కళా కలశకా
వ్య శ్రీలు; వేవచ్చి యీ
కవితారాజ్యము నేలుకో" మ్మనెడు నీ
కమ్రంపు టాహ్వాన మే
యువకున్ బోధిల జేసె నాఁడు నిను డా
యున్ నేఁ డతం డర్థియై!

తడబడినాఁడు నాఁడె తన
దారులు స్పష్టముగాక, గూడెపుం
గుడిసెలలోని యెల్లరును
గుఱ్ఱిడు చుండుట చూచి, లేచి, యే
సడియును లేని రేయిఁ గని,
జాడలు తోఁచక బెంగటిల్లుచున్
అడుగిడినాఁడు నీ పిలుపు
నన్ చిగురించిన క్రొత్త యాశతో!

పవలు ప్రపంచ మెల్ల గెలు
వంగల పువ్వులు చిమ్మచీకటిన్
దవిలి నిజాంగ రాగ మెట
దాచినవో! యెద పట్టుజాల కే
యువిదయుఁ ద్రుంపరాదు, అళి
యున్ భ్రమఁజెంది కలంచఁబోదు, చెం
దొవలు—గులాబు లన్న గుబు
తుల్ కనిపించవు కాళ రాత్రిలో!!

తామరపూలు, తుమ్మెదలు,
దాపటి మావి చిగుళ్లు, కోయిలల్,
ఏమియు లేవు, సర్వము ల
యించె తమిస్రమహోల్బణమ్ములో,
భూమి సమస్తమున్ మునిఁగి
పోయిన లోఁతుల నుండి లేచి కాం
తా మధుకమ్ము పూచె గగ
నమ్మున తామర తంపరై వెసన్.

పిలిచిన పిల్పు మాత్ర మగు
పించ గుపించని కాంతిరేఖగా
తెలుపుచు నున్న దారుల ప
దే పదిగా నడయాడి, యేతదం

చలములు పోర్లి, యావలి కొ
సన్ గుసుమించిన స్వప్న వాటిలో
నిలిచి నుతించినాఁడు జన
నీ! భవదాజ్ఞకు దోయిలించుచున్.

“ కాలము పొంగి పాఱు నొక
గంటకు వేయి మయిళ్లుగాఁగ, తత్
కూలపుటంచు పై కదల
కుండగ నిల్చితి నేను మాత్రమే,
ఏలను జీవిత” మ్మనుచు
నేడ్చెడు నాతని జూచి ఫక్కునన్
నాలుగు దారులున్ గలిసి
నవ్వెను, దువ్వెను పువ్వుటమ్ములన్.

అందినపూలు కోసికొని,
అందనివాని గ్రహించి చూపులన్,
డెందము నీ మనోహర కు
టీరముఖమ్ముగ సాఁగు చుండగా,
అందము లెల్ల గుత్తఁగొని
న ట్లగుపించిన యొక్క మల్లెపూ
పందిరిక్రిందఁ జేరి శ్రమ
ఛాయ క్షణమ్మతఁ డాఁగె ధారిలో!

కోరి నీపూజ కోసమై కోసికొన్న
పూలనెల్లను దోసిటఁ బోసికొనుచు
క్రొంజటను గ్రుచ్చుకొన్నదో కువలయాక్షి,
నీకుఁదనకు నభేదమన్ తీరుతోప!

అతివ పల్కున నీపిల్పు నాలకించి
లలన పెదవిపై నీ కోర్కెలను గ్రహించి,
వనిత రూపున నీయేపు ననుభవించి
నిన్నుపాసించె నతఁడామె కన్నులందు.

ఎఱ్ఱగన్నేరు పొదలలో, నిందుమల్లి
కుంజముల, నల్లగల్వల కొలఁకు పైని,
గున్నమామిడి క్రీనీడ గుడిసె లోన
జ్యోతి యతనికి నీయీడు జోడు నొసఁగు!

ఇది వారి యాంతరంగిక
సదమల జీవిత విధమ్ము, సంఘములో వా
రిది చివరి పంక్తి, పండిత
సదస్సులో లేదొకింత స్థానము తమకున్!

ఏ నటువంటి యింట జని
　　యించితి, మాధవకాలమోహనో
ద్యానపు బొడ్డులో పసిఁడి
　　తామరలో చిఱు తేఁటి చందమై

మానిని నన్ను బిల్చి తన
　　మంచె తలాఁపిటఁ బెట్టి మ్రొక్కె, స
మ్మానిత నైతి నూతన స
　　మాజము నేన సృజించి నట్లుగా!

నన్ను గాంఢాంధకార పర్ణకుటి కెల్ల
జీవన జ్యోతిగాఁ జేసి చెల్వానిలుప
అంతవఱకును లేని యనంత వస్తు
జాల మింద్రజాలముగ సాక్షాత్కరించె।

తమములో దాఁగి కనిపించ దంతెకాని
లేని దన్నది విశ్వాన లేదొకింత
కాంతి కిరణమ్మునకు వాడి కలుగుకొలఁది
చీకటుల లోఁతులోఁతులు చించఁగలుగు.

నవనవోన్మేషమగుచు విజ్ఞాన తేజ
మెంతదూరము పోఁగల దంతమేర
వాస్తవమ్ముగ నిను గనవచ్చు నన్న
సత్య ముజ్జ్వలమ్ముగ గవాక్షమ్ముఁ దెలిచె!

ఇన్ని యుగమ్ము లేఁగినవి,
　　ఇందరి సుందర మందిరాల య
భ్యున్నతి జూచినాను, "కుల
　　మున్ గుణమున్" గలవారి చేతిలో

మన్నన లందుకొంటి, నన
మానవరూపగుణ రూప రాశి యా
యన్నుల మిన్న స్నేహమున
నబ్బిన సౌఖ్య మెఱుంగ నెవ్వడున్.

పేదతనము చేత పీడించఁ బడుచుండి
పాఁత గుడిసెలోన వాస ముండి
పెదవి దాఁట నీదు పీయూషమే తప్ప,
కంట జాఱనీదు కాంతి తప్ప!

ఏదో పరిహాసమాడుచు మీఁద వంగి
సఖుని ముద్దిడుకొన్న దా చంద్రకిరణ!
తత్సుధాసిక్త తరళ నేత్రముల ముందు
గ్రుడ్డి దీపమునై నేను గూఁట నుంటి!

విశ్వమున భూమి, భూమిపై విరులఁదోఁట,
తోఁటలోఁ గొంప, కొంపలో బాటసారి,
బాటసారి కరమ్మున పాఁత కలము,
కలముతోఁ గ్రొత్త విశ్వాలు కతలు చెప్పు!

కంది కంపలతో పెండె కట్టు కట్టి,
కొబ్బరాకులు తూరిచి, గోమయమ్ము
నెట్టిమన్నును పిసికి పట్టించినట్టి
గోడలవి, నన్నుజూచి గగ్గోలుపొందె!

భాను రశ్మిని మబ్బుల భంగి, నావె
లుంగు నెల్లను గోడలు క్రుంగ వైచి
మసక చీకటిలో తమ యసలు రూపు
దాఁచుకొన గోరుచున్నట్లు తోఁచె నాకు !

గోడలతో రాజీపడి,
నీడలతో వానిలోని సెరియుల నెల్లన్
పూడిచి, నే గది నంతయుఁ
జూడన్ దొరకొంటి జంకుచున్ మెల మెల్లన్.

ఒకమూల మంటిపాత్రికల దొంతరలతో
ఆరిపోయిన పొయ్యి చేరుచుండ,
ఒకచోట ప్రాఁత పేటికల మూఁతలు త్రోచి
శూన్యం బెదో తొంగి చూచుచుండ,
ఒక ప్రక్కఁ బ్రక్కవాటికనుంచి గైకొన్న
సంపంగి పూదండ సణుగుచుండ
ఒక యెడ చింకి పేలికలతో దండెమ్ము
సిగ్గున చాటుకు తగ్గుచుండ,
మల్లెపూలకు మాత్రమే మనసు విప్పి,
కాంతుమోమున మాత్రమే కన్ను నిల్పి
మానిని యెదో యెదో మేల మాడుచుండ
ఒక్కటే గది—అది చాల చిక్కియుండె.

గదిగోడు చూడఁ డాతఁడు
ముదితయు నాతనికి గడ, మోహావశులై
పెదవులలో ననురాగ ప్ర
మదిరన్ సేవింత్రు, మేను మఱతురు దానన్.

గట్టుపైఁగల దర్భగడ్డి దుబ్బులు కోసి
కొమ్మ కూర్చిన చాఁపఁ గూరుచుండి
బుడమ గట్టున ప్రత్తి వడికిన నూలుతో
వనిత యల్లిన బనియను ధరించి
రామబంధువు తోఁట రాల్చిన యీఁకతో
నకి తీర్చి నట్టి తూలికను బట్టి
కోయ తెచ్చిన కరక్కాయలు మఱగించి
చెలువ వండిన సిరా చెంతనుంచి
అతివ చేసిన చేతి కాగితము మీఁద
పడతి పెట్టిన ప్రమిదె దీపమ్ము ముందు
తరుణిలో నిన్ను, నీలోన తనను గనుచు
కేళి నాతఁడు రచన సాఁగించు చుండె.

అనియు నానకున్న వెలుఁ
గందని చీకటి మూల నేదొ సా
మాను గదల్చి, కెవ్వుమని
మానిని ఫక్కున నవ్వె నంత, గు

మ్మానికి దూఁకి పామొకఁడు
మాలతి తీగల మాయమయ్యో, వ
క్షానికి ప్రాకి వేదన యొ
కండు స్వరూపము దాల్చె నామెలో!

గోడ క్రీనీడ నయిరేణి గూనక్రింద
వెచ్చగా పండుకొనియున్న వెఱ్ఱిపాము
బెదరి పర్వెత్తినది ముళ్ల పొదల లోకి
ప్రియమగును గాకయంచు ప్రార్థించునామె!

తేళ్లు, పాములు, కోళ్లు, కుందేళ్లు, లేళ్లు,
పిచ్చుకలు, రామచిల్కలు, పికము, లళులు,
తోఁటఁగల వెల్ల నీదంపతులకు చెలులె!
వారి హృదయమ్ము వసుధైక వసతిగృహము.

మించి నట్టింట వరలక్ష్మి మెలఁగు నట్లు
కాలి మట్టెలందెలు ఘల్లు ఘల్లు రనఁగ
క్షణములోనెల్ల పనులును జక్కఁబెట్టి
చాన కానంతఁగూర్చుండె సఖుని చెంత.

నాకు భీతిల్లి గదిలోని చీకటెల్ల
కురుల నెపమున సుమవేణి శరణుఁజొచ్చి
మల్లెపొదగ నెంచిన యామె మగని చూపు
తుమ్మెదల బారిఁబడి త్రుళ్లి త్రుళ్లిపడును!

ఇరుల గముల నెల్ల కురుల కుచ్చుగఁదాల్చి
వచ్చి, సుకవి చెంత పౌర్ణమాసి
కూరుచున్నరీతి, కొమరొందు నాసతి
మల్లె పూలతోడ, మరులతోడ !

వక్షమాతని వామపార్శ్వమ్ము నొఱయ,
చెంప లాతని చెక్కిళ్ల స్నేహ మలఁద,
సుదతి యాతనిపై వ్రాలి చదువసాఁగె
వ్రాయఁబడుచున్న పద్యంపుఁ బ్రతీ పదమ్ము.

అక్షర ముకురమును నలి
నాక్షి పఠించుచు ప్రహృష్టయగుచు వసింపన్
అక్షర సత్కావ్యం బతఁ
డక్షయ భావాభిధాముఁడై నిర్మించున్ !

అతఁడతఁడు కాఁడు—కవితా వియద్ధు నీ ప్ర
వాహమున నీఁతగొట్టు దివ్యక్షణాల,
అమృత సౌందర్య సృజనాత్మ కాత్మలెల్ల
నతని లోఁ జొచ్చి వికసించు నంత సేపు!

కావ్యరచన వారి కాహారమైనట్లు
వలపుఁ గ్రోలి బ్రతుకఁ గలిగినట్లు
పరమ ధనములెల్ల కరమందె యున్నట్లు
విమల మతుల వారు విశ్రమింత్రు.

ఒకమూల మిణుఁకు మిణుఁగురు,
ఒకమూలకుఁ గాంతులంపు నుడురాజములున్,
ఒకమూల నేను, నిటులా
సుకవిన్ సేవించినాము శుభ్రాత్మములన్.

మల్లెపూల నుండి, తెల్ల గల్వల నుండి,
కడిమి కొసల నుండి, యుడుల నుండి,
పాల పుంతనుండి ప్రవహించి యాతని
మనసు ముంచునేదొ మధురసమ్ము.

పరవశము నంది యాతఁడు వ్రాయసాఁగె,
పంచమస్థాయిలో నామె పాడసాఁగె,
కాంత గళమున నేను నాగళముఁగలిపి
వినుతిఁ జేయఁగ సాఁగితి విశ్వకవిని.

"వ్రాయుదు వెన్ని కల్పముల
బట్టియొ తీరిక లేనిరీతి వి
శ్వాయత కావ్య, మింక నొక
పారముచేర, దికెన్ని నూతనా
ధ్యాయము లున్నవో తెలియ
దయ్య రచింపఁగ, నింత హాయిగా
తీయము 'లొల్కు' నీ కలమ
దెంత సుధాప్రవాదమో, మహాకవీ!

రసమయమైన నీ కవన
　　రాజ వనమ్ముల నొక్క తేటినై
మెసలుచు, నింత కాలమొక
　　మేరకు పీఠికె చూడలేదు, సా
రసములు లేవు—గడ్డి పువు
　　రంగుల వాకిటి శోభనంపుఁ గ్రొం
బసపునకైన నోచు కొన
　　మా? మరికెప్పుడు పారిజాతముల్?

పూవులలోన తావి, పున్నె
　　బోణులలోనఁ బవిత్ర శీలమున్,
మావులలోనఁ గోకిలము,
　　మావులఁ జుక్కల బాలచంద్రునిన్
భావనచేసి మా కొసఁగి
　　నట్టి మహాకవి! అందుకొమ్మమా
జీవన శుభ్రవాహినులు
　　చేరుచున్నవి నీ హృదబ్ధికిన్!

పదముల మేము కూరుపుల
　　పద్ధతి నర్థము లిచ్చు నక్షరా
స్పదమగు విశ్వకావ్యమున,
　　ఛందము, శబ్దము, పద్యరూప సం

పద కనుగుణ్యమౌ గతి స
　　మంచితరీతి రచించుచుండి, యే
పద మెట నుంతువో, తుడిచి
　　వైతువొ, చిక్కవు భావ వైఖరుల్!

ఈ విశ్వమ్మును విప్పిచూచి, యిట మా
　　కేమున్నదం చేడ్వఁగా,
పూవుల్ చూపి, పికమ్ముఁజూపి, మధు భూ
　　ముల్ చూపి—యేవేవొ లీ
లావర్ణమ్ములు, నిస్వనమ్ములు, కళా
　　లాలిత్యముల్ చూపి, మా
శ్రోవన్ మల్పితి, వేది నీ కరుణ సిం
　　ధు ఖ్యాతి ? వర్షింపుమా!

నీవున్ నావలె నిత్రుపాసమున ని
　　ర్నిద్రుండవై. యేదొ భా
వావేశమ్మున జీవితమ్ము నొక ప
　　ద్యమ్మట్లు నిర్మింతు! న
న్నేవర్గమ్మున జేర్చినన్ సరియె, కా
　　నీ, వ్యర్థ శబ్దమ్ముగా
దేవా! వాడకుమోయి, కొల్తు నిను న
　　ర్థిన్ పాద పాదమ్మునన్!”

పదపదమ్ము స్పృశించుచు, పాదపాద
పద్మ మధువును గ్రోలుచు, పద్యపద్య
పూర్ణ రసమున లీనమైపోవు, చేను,
ప్రకృతి రచయిత నూహించి పాడినాను.

పాడిన కొలంది కంఠము పల్లవించి
మధురమై చిందు కెమ్మోవి మధురసమ్ము,
హృదయ పాత్రము నిండి పొర్లిన కొలంది
ముందు నిల్చితి వీవు సమ్మోహనముగ !

పేద కేనుఁగు నిచ్చిన విధము నాకు
నింత మాధుర్య, మెట్లు జీర్ణించుకొందు ?
రమ్యతా రసబ్రహ్మ పారమ్యమందు
చేరుటెట్లు నాయిచ్ఛ నాచేత లేక ?

ఈ విశ్వమందు లేదే
భావమ్మును నిన్ను మించి, ప్రకృతి స్థితికిన్
నీవే బాహ్యాంతరములు,
దేవీ ! నినుగంటి నన్యదృష్టి నశింపన్.

లాలిత్యమునకు గులాబి రేకనుఁ జూపి,
పరిమళమ్మునకు సంపంగిఁ జూపి,
అనురాగమునకు సూర్యానువర్తిని బంకజముఁ జూపి,
కారుణ్యమునకుఁ జూపి,

దరహాసమునకుఁ గుంద ప్రసూనముఁ జూపి,
రమ్యేక్షకిందీవరమ్ముఁ జూపి,
మాధురిమకు నవ్యమందారమునుఁ జూపి,
పావనతకు ముద్దబంతిఁ జూపి,
ప్రణయమునకుఁ గదంబ కోరకముఁ జూపి,
మోహనాశంసనకు మావిమొగ్గఁ జూపి,
నీవు మాత్రము కాన్పింప, కీ విధాన
తప్పుకొందువు, తల్లి ! ఆదర్శమందు !

సృష్టి వ్యక్తిత్వ మందునఁ జూడఁగలము
ఒక్కొకెడ నీదు రమ్యత లొక్కొకటిగ,
మొత్తముగ నిన్ను పొందెడి మోహమున్న
ప్రకృతి నంతను సందిటఁ బట్టవలయు !

అవిరతాంధ తమోద్రి సానువులఁ బుట్టి
వెలుఁగు వాగులు ప్రవహించు వివిధ గతుల,
వాగులనుగట్టి, గుండెలు సాగుచేసి
నిన్ను కవి కృషీశ్వరుఁడు పండించుకొనును.

భావ, భౌతికవాద వివర్తనమ్ము
నాస్తి కాస్తిక సంఘర్షణమ్ము నెల్ల
పద్మబంధిత మధుప సంభ్రమమె, యెందు
రమ్యరీతుల రమించు రసవివక్ష.

సఖి యొసంగిన సుఖ పరిష్వంగ మందు
అతఁడు నీ శోభ లెల్ల సంచితము చేసి
అనుభవించుచు పరవశుఁడైన ఘడియ
మూఁడు మూర్తుల నామె నిన్ బోలియుండె!

పర నారీత్వము తనలో
పరివర్తితమైన నారి పరమేశ్వరి, యే
పరమార్థము లే దటుపై,
పరమేశ్వరి నేలువాఁడు పరమేశ్వరుఁడే.

తరుణ దంపతు లిర్వురా తలిరుశయ్య
ప్రణయలీలా కలాకలాపములు నెఱప,
అల సరస్వతీ చతురాననుల మనోజ్ఞ
మణిత కథతోడ సూరన్న మదికివచ్చె!

అది మదిని వదలి నాయెద
మెదిలెను, దీగూఁడు నేదో మృదుభావమునన్
గదిలెను ముందుకు, నా స్థితి
చెదరెను, నేలపయి జాతి చితికితి నేనున్.

ముక్క ముక్కలుగా విచ్చిపోయె ప్రమిదె,
తైలమంతయు వేవేగ నేల నింకె,
దేహ మున్నంతవఱకె యే స్నేహమైన,
ఆత్మ యెంతటి పారతంత్ర్యమున బ్రతుకు!

లేదు తైలము, ప్రమిదెయు లేదు, వత్తి
యొక్క టాధారముగ వెల్గుచుంటి నేను
అదియుఁ బోయిన నేను బోవుదును దాన,
ఏ పదార్థము లేక లేదే వెలుంగు.

ఎలుక పిల్లయేదొ తోలఁగఁద్రోసిన దంచు
మగని పట్టునుండి మగువ లేచి,
మరొక ప్రమిదె తెచ్చి, మంచినూనెను పోసి,
దాన నన్ను క్రొత్తదానిఁ జేసె.

ప్రాఁత కాగితమున వ్రాయఁబడిన యొక్క
పద్యమును జూచితిని క్రిందఁబడిన నేను,
బ్రతుకు కొనతీగ పువ్వుమ్ము పట్టు తప్పి
పృథివిఁబడి కాని కనఁబోదు వ్రేళ్ల గోడు.

" మేదిని కాఱు దున్నవలె
మీఁదికి మీఁదికిఁ బోవుచున్న, దే
రోదనమో కనుక్కుమని
రోదసి గుండెకుఁ గ్రుచ్చుకొన్న, దే
భేదము హేతువో ప్రళయ
భీకర మారణ హోమ మింత, కే
బూదిని మాసిపోవునొ, ప్ర
భూ! భవదీయ కళాలయమ్మిఁకన్! "

ఇంతవఱకును మనదీప కాంతలెల్ల
విన్నవించిన సర్వమిందున్నదమ్మ!
పూర్ణవైరుధ్యములతోడ పృథ్వి నేడు
వ్రీలి తనమీఁద తానె సవాలు చేయు.

ఎచట హృదయమ్ము లోపించు నచట సిరులు
రాసులై చేరి జీవ సారములు పిండు!
ఒక్కఁ డాఁకలి వేయక ముక్కు చుండ
వెక్కు రాఁకలి తీరక పొక్కుచుండ్రు!

కూడు, గుడ్డ, కొంప—మూఁడే సుమీ నేడు
నరులు కోరుచున్న వరములెల్ల,
కోటి విద్యలైన కూటికోసమె యన్న
మాట మంత్రమయ్యె మానవులకు!

తిండి లభియించు టెట్లన్నదే సుమీ స
మస్యయై తినుచున్నది మనుజు గుండె,
అది విజృంభించి సర్వమ్ము నాహరించు
హావనమున్ గాంచి భీతిల్లు కవి కలమ్ము!

జీవితమే కవిత్వముగఁ
జేసుక నీ కవి కూర్చు కావ్యముల్
భావ సువర్ణ లేఖలు, క
ళార్ణవ రత్నమయూఖ, లన్నవూ

ర్ణావర హస్తరేఖలు, సు
        రద్రుమ శాఖలు, కాని, యెవ్వరా
శ్రోవకి రాదు! పోవుదు రె
        దో యొక "కర్మ"కు నిబద్ధ బుద్ధులై!

వాల్మీకి మొదటి కావ్యము పల్కినప్పుడు
        కందమూల ఫలాలు కరువుకాదు,
వ్యాసుడు భారతామ్నాయమ్ము సమకూర్చు
        నప్పటి కన్నపూర్ణమ్మ కలదు,
కాళిదాసుడు మబ్బు కబురు చెప్పిననాడు
        జగమెల్ల సస్య సుశ్యామలమ్ము,
సూరన్న వాక్కళాసుందరిఁ దీర్చి ది
        ద్దిన నాఁడు రాజపోషణము కలదు.
గంజి కేంద్రాల నంజలిఁ గట్టుకొన్న
అస్థిపంజర మాధుని కార్యభూమి!
కడుపునిండక పోలికేక లిడుట తప్ప
మధురకవితా రసానంద మందు టెట్లు?

బ్రతుకు, బ్రతుకనిచ్చు పశ్వాది గణములు
తమకు తాము శాసనములు లేక,
నర సమాజమందు కొరడాను పుచ్చుక
శాంతి భద్రతలను సాఁక వలయు!

గంగకీవల పంట కాన్పించని కతాన
అటు త్రివిష్టపముపై కరిగినారు,
వానర దేశాన వంతుఁ గోసుటచేత
లంకాధిపత్యమ్ము లాగినారు.
ఐదూళ్లనే నీయు మన్నదానికి కురు
క్షేత్రమ్ము మరుభూమిఁ జేసినారు,
మాది మాకిమ్మన్న మాటకు దేశభ
క్తుల నెత్తుటన్ నేల దున్నినారు,
నాఁటి దేవాసురుల పోరు, నేఁటి వలస
రాజ్యములలోని ప్రజల పోరాట, మేది
యైన నొక్కటియే; లోక యాతనలకు
కలిమిలేముల తేడాయె కారణమ్ము,

దారిద్ర్యమ్మననేమి? మానవున కీ
దైన్యమ్ము రానేల? కీ
కారణ్యమ్ముల—నర్ణవమ్ములను దా
స్యమ్మున్నదే జీవికిన్?
ఆరామమ్మున పుష్పమట్లు మనుటే
యాదర్శమై పుట్టి, యీ
కారాకారము దాల్పనేల నరుఁడీ
కాటిల్య మేమందువో?

కోట్లకొలఁది మానవులకుఁ గూడు, గుడ్డ,
కొంప లభియించు విధము చింతింపకుండ
పుణ్యమని, పాపమని ప్రాఁత పుస్తకముల
వ్రాసిపెట్టుట వలన లాభమ్ము లేదు.

సత్యమ్ముఁ బల్కింపఁ జాలి నారలె, హరి
శ్చంద్ర నాటక మెన్నొసారు లాడి ?
పరపీడనమ్ము మాన్పం గల్గిరే, బుద్ధ
క్రైస్తు, గాంధీజీల కథలు చెప్పి ?
అఘమును ద్రుంచి పుణ్యముఁ బెంచఁజాలిరే,
పరదేవతల చిత్రపటము లమ్మి ?
సర్వసమత్వమ్ము స్థాపించఁగల్గిరే
వేదాంత సూత్రముల్ వేయిచెప్పి ?
నీతి శాస్త్రాల కుప్పపై నిల్చి, ధర్మ
నిర్ణయము గోరుచున్నాఁడు నేఁడు నరుఁడు ;
రేపు తిండియెట్లను చింత బాపకుండ
దేవి ! సంఘమ్ము నెటు చక్కదిద్దలేము.

ఓటమికి జంకి బ్రతుకు పోరాటమందు
ఏది దొరికిన నదె ప్రయోగించు జీవి,
జయమె జీవిత సాఫల్యమయిన కతన,
పంపు మెవ్వరి రాజ్యమ్ము వారికిచ్చి.

ప్రగతి కారణమైన ఘర్షణములోన
వేదనకు, రోదనకు హేతు వేల కలుగు ?
విశ్వతోముఖముగ వెల్లి విరియు సృష్టి
పువ్వు మధుపమ్ములకు మధ్య పోటి పడుచు.

పుడమి సంఘర్షమున హోయి పుట్టినపుడె
అభ్యుదయ మగునది జీవితాధ్వమందు
కలిమి లేములు నడిపెడు కదనమందు
కోటి గుండెల కోరికల్ కూలిపోవు.

బ్రతుకొక సమస్య, నీప్రభుత్వము పరిష్క-
రించ లేనిది లేదు ప్రపంచ మందు,
నీవు సంకల్ప మాత్రాన నింపఁగలవు
మానవాశాసుమమ్ముల మధురసమ్ము.

కష్టమునుకాదు. సుఖమునుకాదు బ్రతుకు,
అదొక ధర్మము ; దాని జయప్రదముగ
నిర్వహించుట కవకాశ మివ్వవలయు,
ఉద్గతమ్మగు నపుడ సర్వోదయమ్ము.

మానవుని భావనోద్యానమందు పూచు
ప్రతిసుమమ్మును ఫలియించు వసతి నిడుము,
ఒకనికోర్కెను ఛీకొని యొకనికోర్కె
బద్దలై పోవకుండ జాగ్రత్తపడుము.

వ్యక్తికి మరొక్క వ్యక్తి దాస్యమ్ము చేయు
దుస్థితిని బాపి, నీవ యితోధికముగ
సత్త్వమను మానవుని గుండె కిత్తువేని
క్రొత్తదారుల నతఁడు పురోగమించు !

ముందుగ జీవితావసర
　　ముల్ కొఱతీరిన, వెన్క మానవుం
డందముఁ జూడ నోపు, పర
　　మార్థపు లోఁతులు తీయఁగల్గు, నా
నందముతో కళామధు వ
　　వనమ్ములు నింపఁగ నేర్చు మన్గడన్,
అందు కొనంగఁ జాలు భవ
　　దంఘ్రులు నప్పుడు సర్వలోకముల్ !

కూడ గట్టిన జవమెల్ల కూటికొఱకె
వ్యర్థముగ మానవుఁడు నేఁడు వ్యయము చేయు,
తిండి బెంగను దొలఁగించె దేని, తల్లి !
గజ్జె కట్టఁడె నిన్ను నాల్కపయి నిల్పి !

పొలములలోన పల్లములు
　　పూడిచి, గొప్పులుత్రవ్వి, యడ్డు క
ట్టలు నిడి రైతు కష్టపడు

ర్తిలుటకు మానవుండు పలు
రీతుల కంచెలుపాతి, చట్టముల్
వెలయఁగఁ జేసినాఁడు——తగ
వెక్కుడి దుమ్మడి సేద్యమైనచో ?

నాది నీదన్న భేద మంతకును, ధనము
దాఁచి పెట్టెడి స్వార్థమంతకును, భావి
రక్షితము కాక యునికి కారణము ; కాన
సౌఖ్యమెల్ల నీయభయ హస్తమునె కలదు.

అవనీ భారముఁ బాపఁగ
నవతారము లెత్తనేల ? అజ్ఞాన తమో
జవనిక తొలఁగింపుము, నీ
యవకాశపు రుచులు మనుజుఁ డాస్వాదించున్.

ఆయమును ప్రాయమును దినివేయు నరుని
వ్యాధులకు, బాధలకు నెల్ల వ్యథల కొక్క
లేమి హేతువు ; లేమియె లేకయున్న
మనుజ లోకమ్ము సంపూర్ణమై వెలారు.

కలిమి పోవు నంచు కల వాఁడు, లేమిని
లేనివాఁడు దిగులుతో నశింత్రు,
నాశనమ్ము లేని నవసృష్టికి పునాది
లేమి బూదె మీఁద లేప వలయు.

తీరిపోయిన దేని యార్థికసమస్య,
లోకమున రాజకీయము లుప్తమగును ;
రాలు నధికారవాంఛ కారాకుపోలె,
అంత బ్రతుకెల్ల విరిసి మారాకు తొడుగు.

సంతృప్తి కలదు కృషిలో
సంతోషముతోడ దాని సాగించిన ; మా
ర్గాంతరము లేదు ప్రగతికి,
ధ్వాంతముఁ జీల్చుకొని పైకి వచ్చుట తప్పన్.

విరులు భూమినుండి, మెఱుపు మబ్బులనుండి,
కాంతి తమమునుండి కలిగినట్లు,
నిఖల జీవశక్తి నీనుండి ప్రవహించు,
వెడల నిమ్ము దాని వెల్లివిరిసి !

దీపసఖు లెల్లరను నీకు తెలుపుకొన్న
వివరములలోన కాన్పించు నవని కొంత,
పీడలను చీడలను బాపి పెంచె దేని
మానవారామ మభిరామమై వెలారు !

ఈరీతి నేను, జగతీ
భారమ్మును గూర్చి, నీదు బాధ్యతను గురిం
చూరక తలపోయుచు, నీ
యారాధన మున్గియున్న యతనిన్ గంటిన్

ఏ రస మెప్పు డే తరఁగ
నేగతి నుద్రతమై, యుదగ్రమై
మీఱునో, గట్టుపొర్లి పాలి
మేరలు ముంచునో చెప్పలేము, కా
సారము కూడ తీవ్ర తర
ఝంఝకు నుప్పర మంటి పోయెడున్!
పారములేని దీని కొక
పద్ధతి చూపుము, సాఁగి పోవఁగన్.

ప్రగతి శీలము, శోభనప్రదము నైన
రాగరసమున నీకు తారళ్య మొసఁగి
పరమ సౌభాగ్యమున కాంత పరవశిల్ల
రచన చాలించి యతఁ డనురక్తుఁడయ్యె!

ముదిత మోమును జూచు, నా మోముఁ జూచు,
వలపుఁ గ్రొందేనె చిఱు నిపాతలకుఁ బట్టి
నేను తగ్గిన కొలఁది యా నెలఁత హెచ్చి
అతని తలఁపును పూర్తిగ నాక్రమించె!

అప్పు డసూయతో నన్ను నే నరసి కొంటి,
ఆత్మ పరిశీలనము మంచిదయ్యె నాకు,
పడఁతి కెమ్మోవి తీయగా పరిమళించు,
నూనె వాసన యేదో నానుండి వెడలు!

ఆఖరై పోయె ప్రమిదె కాయమునఁ జమురు,
ఆరిపోయెను తడి వర్తి యాత్మ నుండి,
బ్రదుకు నిమిషాలపై నున్న యదను లోన
తవిలె మనసున శాశ్వతత్త్వంపుఁ దలఁపు!

ప్రమిదె, వత్తి, నూనె, రవ్వంత నిప్పును
కలిసి వెలుఁగు దీప కళిక నేను
ఆఖరాట యేమొ, అందు కేది కతమ్మొ
తెలిసి కొనఁగఁ దల్లడిలితి చాల.

చీకటి నుండి పుట్టి, మరి
 చీకటి లోనికె గిట్టు కర్మ కే
లా కమనీయ కాంతుల ల
 లాటము లాట తలమ్ము లయ్యె! నీ
చీకటి నెల్లఁ గాల్చఁగల
 శీలము వెల్గున కేల లే దొకో!
లోకము లేలకో తమసి
 లోఁబడి మున్గుచుఁ, దేలుచుండెడున్!!

తరుమఁగలదె కాని హరియింప నేరదు
దివ్వె యెట్టిదైన తిమిరములను,
శక్తి కలదె యయ్యు చైతన్య మిసుమంత
కప్పు తాఁకె నేని గుప్పుమనును.

నల్ల నేలనుండి పల్లవించిన మల్లె
డుల్లి పోవు సుఖుని యుల్లమందు,
అంతమాత్రమైన యానంద మెఱుఁగని
బ్రతు కిదేమొ యంత్రగతి గమించు !

నల్లని చీకటి కడుపున
తెల్లని వెలుఁగెట్లు కల్గు ? స్థిర జీవన సం
పల్లహరి కాక యుంటకు
తల్లీ ! కతమేమి ! తెలియ దణుమాత్రమ్మున్ !

వెలుఁగుల కెల్ల తల్లియగు
        విశ్వ సరస్వతి పుట్టినిల్లె యీ
తొలఁగని యంధకార మని
        తోఁచదు వెగ్గెడు నంత సేపునన్,
కలఁగితి వత్తిపైని మమ
        కారము తీరక, తీరుచున్న మే
-రల నిజరూపముల్ తెలియ
        రాక పెనంగితి మృత్యుమూర్తితో !

సత్త్వ సంపన్నమును, సర్వశక్తియుతము,
పూర్ణమును నైన తమముతోఁ బోరు టెట్లు
కాంతి మాత్రము గుణమైన కళిక ? రత్న
మెట్లు రత్నాకరమ్ము నిర్జించఁగలదు ?

నూనె లేకుండ నను వెలుంగు మని కోరు
కైసరుని కోర్కె తీర్చు మార్గమ్ము లేక
ప్రజ్వరిల లేని రసహీన భావమట్లు
అణఁగి పోతిని, శూన్యాన నారిపోతి.

కాంతియును జీవనమ్ము నొక్కటియె, వాని
నారకుండ నిల్పుట యసాధ్యమ్ము కాదు,
చీకటిని బట్టుకొనగల్గు సిద్ధి యున్న
వెలుఁగునకు శాశ్వతత్వమ్ము వెలయు దాన.

రవి గల్గిన భువికే యీ
చివుకులు, పెరచోట్ల లేవు చీకటి వెలుఁగుల్
కవికలము నెరవు గైకొని
దివిగా భువినెల్ల తీర్చి దిద్దుము, తల్లీ !

చిమ్మ చీకటి రొమ్ముపై చిద్విలాస
వృత్తిమై చేరి వీణ వాయించు దివ్వె !
ఓ స్వయంప్రభ ! ఓ పరంజ్యోతి ! లెమ్ము
ప్రాణి ప్రతియింట నీదె యగ్రాసనమ్ము !

ఏదో యొక దీపపు వెలుఁ
గేదో యొక మూలమిణుఁక కే మానవుఁడున్
నీదారిఁ దెలియఁ జాలఁడు,
నా దేవీ ! లేచిరమ్ము నాతో భువికిన్ !

దీప మారతిని ముగించి, దేవిఁ గూర్చి
వినయ వినమిత మగుచు వందనము చేసి,
ఆమె దరహాసమం దదృశ్యమయి పోయె,
దీపసభ తిరోహిత మయ్యె, దేవి మిగిలె!

ఎఱ్ఱదామర తోఁట యేపున వికసించి
నవసంధ్య సింహాసనము రచింప,
మల్లిపువ్వులు మంజుమణులట్లు తరళమై
పాలవెన్నెల చీర పరిఢవిల్ల,
చీకట్ల మెసవి త్రేన్చిన తేంట్ల గమి రీతి
చెంపల నెఱికురుల్ చిందులాడ,
నల్లగల్వల చాయ నలుదిక్కులకుఁ బంపి
కాటుక కనుఁదోయి కాంతులూర,
సూర్యచంద్ర ప్రదీపాది శోభలెల్ల
దినదినమ్మును వెలిఁగించు దివ్యయామె
హాయిగొల్పెడి రసపూర హాసరేఖ
విరిసి, నను ముంచి, కరిఁగించి, వివశుఁ జేసె!

ఆ మహానంద సుందర సీమ నొక్క
చిటికలో దాటి, నేనంత సిగ్గు పడుచు
ఆ రసైకాంత విశ్వశుద్ధాంత మందు
వేడుకొంటిని "మన్నింపవే" యటంచు.

"నను మన్నింపు" మటంచు నే నుడువు నం
తన్, "చాలు, చాలించు, నూ
తన మీ ప్రార్థన, మెందు నేర్చితివి చా
దస్తమ్ము? నీకన్న ముం
దినుఁడే తూర్పుమొగాన ముద్దుగొనుచుం
డెన్ గాంచవో" యంచు మో
విని మోవిన్ గొని లేపుచున్న నిజ దే
విన్ గాంచి—మేల్కాంచితిన్!!

Printed at the Rathnam Press, Madras-1.

# మ ధు బా ల

రచన : భీమన్న

మనోహరమైన మధురకావ్యం. ఇది మద్రాసు యూనివర్సిటీలో బి. ఏ. కు, ఆంధ్ర యూనివర్సిటీలో భాషా ప్రవీణకు ఆధునిక కవితా పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడింది.

ప్రతులకు : దేశికవితామండలి, విజయవాడ.

# రాగోదయం

రచన : భీమన్న

రస్యమానత రంజిల్లే రమణీయ గేయాల సంపుటి. దీనిలోని గేయాలు ఆలిండియా రేడియో లలిత సంగీత కార్యక్రమాలలో బ్రాడ్ కాస్టు చేయబడుతున్నాయి.

ప్రచురణ : దేశికవితామండలి, విజయవాడ.